



జాతీయసైనిక శిక్షణదళంలోని కొందరు బాలికలు
చేస్తున్న సంఘసేవ సందర్భమున ఒక పసిపాపను
స్నానం చేయిస్తున్న దృశ్యము.





మధురకు దగ్గరగానున్న గాంధీగ్రాం నివాసి - ఒక
స్త్రీ వీధి దీపాన్ని తుడుస్తున్న దృశ్యము.

# మీరు కొన్నారా

# 10-సంవత్సరాల నేషనల్ ప్లాన్ సర్టిఫికేట్లు

**4½%**
**ఫలించునాటికి వడ్డీ**
**ఆదాయపు పన్ను లేదు**

# ఇప్పుడే కొనండి

## ఇలాగ మీరుపెట్టే పెట్టుబడి ఇండియా అభ్యున్నతి నిమిత్తమే

- మీరు రు. 25/- నుండి రు. 1,000 వరకు, జాయింటుగా రు. 2,000 వరకు పెట్టుబడి పెట్టవచ్చు.
- ఫలించునాటికి సాలుకు 4½% ఆకర్షణీయమైన వడ్డీ-ఆదాయపు పన్ను లేదు.
- ఒక సంవత్సరం గతించినమీదట ఎప్పుడైనా వీటిని ఇచ్చి సొమ్ము పుచ్చుకోవచ్చు. కాని, అవి ఫలించువరకు ఆగడమే ఉత్తమం.

ఇతర వివరాలకై కోరండి :

ఏ తపాలాఫీసులోనైనా; అధికార నియుక్తుడగు ఏ ఏజెంటునైనా; లేక, నేషనల్ సేవింగ్స్ సంస్థ ఆర్గనైజరు; ప్రాంతీయ నేషనల్ సేవింగ్సు ఆఫీసరు.

AC 588 TG

# ఇండియా భవిష్యత్తు నిమిత్తం పెట్టుబడి పెట్టండి

# మహిళల ఆరోగ్య రక్షణకు

## లోధ్ర

గర్భాశయరోగ నివారిణి.

స్త్రీలకు గలుగు బుతుశూలల, బహిష్ఠ కాకుండుట, అకాలబహిష్ఠ, మైల జాస్తిగాను తక్కువగాను పోవుట, కుసుమరోగము, సంతానహీనత, రక్త హీనత, మలబద్ధము, సూతికావాతము, కీళ్లనొప్పులు, అరికాళ్లు అరచేతులు మంట మొదలగు స్త్రీ మర్మ వ్యాధులను కుదుర్చును.

**12 ఔ. రు. 4–4–0    6 ఔ. రు. 2–4–0**

## మాదీఫల రసాయనము

ఇది ముదిరిన మాదీఫలముల రసముతో తయారు చేయబడినది. గర్భిణిస్త్రీలకు కలుగు వాంతులకు (వేవిళ్లు) యిది సంజీవివంటిది. తలతిరుగుడు, వాంతులు, అరోచకము, అజీర్ణము, మలబద్ధకము, నిద్రలేమి మొదలగు జబ్బులకు వజ్రాయుధము. జ్వర వేగమును తగ్గించుటలో యీ రసాయనము పేరుపొందినది. ఇది తేనెవలెయుండి నోటికి రుచిగను యింపుగను నుండును.

**3 ఔన్సుల బుడ్డి రు. 1–4–0**

## గర్భరక్షక

స్త్రీలు బలహీనులగుటచేత గర్భము ధరించిన పిమ్మట పెక్కురుగ్మతల పాలగుచున్నారు. ముఖ్యముగ వీరలకు గర్భస్రావము, అకాలప్రసవము, అప్పుడప్పుడు కడుపునొప్పి, నడుమునొప్పి, రక్తహీనము, శరీరమందు నీరుచేరుట, బలహీనము, అలసట, ఆయాసము, అజీర్తి, మలబద్ధకము మొదలగు జబ్బులు కలుగుచున్నవి. ఈ 'గర్భరక్షక' సేవించిన పై జబ్బులు రాకుండుటయేగాక ప్రసవించువరకును శరీరము మంచి ఆరోగ్యస్థితి గలిగియుండి నిండుమాసములు గర్భము ధరించి సుఖముగ ప్రసవించెదరు.

**3 ఔ॥ రు. 3–2–0    6 ఔ॥ రు. 5–8–0**

## క్షీరబలా తైలం

స్త్రీలకు బుతుస్రావ దోషముచే గల్గు వాత వ్యాధులు, పార్శ్వపు తలనొప్పులు, తలపోటు, గర్భవాతము, శరీరము బలిసియుండుట, మూర్ఛ, అపస్మారవ్యాధులు, క్షయవ్యాధి, నరముల బలహీనత, యీ తైలముతో అభ్యంజన మొనర్చిన నివర్తించును.

**6 ఔ॥ల బుడ్డి రు. 3–0–0**

## సౌభాగ్య శొంఠి

బాలింతలేహ్యము

ప్రసవానంతరమున స్త్రీలకు బాలింతకారమును ఒక ఘాటు ఔషధమును యివ్వు ఆచారము మన దేశమున చిరకాలముగనున్నది. అయితే ఈ కారమును లెక్కలేనన్ని పచారిదుకాణపు సామానులతో తయారు చేసి యిచ్చుచున్నారు. ఇందు కలియువస్తువుల పరిమాణమును, పదార్థజ్ఞానమును పాటింపక మందును తయారు చేయుదురు. ఈ కారము వారికి వేడిచేసి అనేక రుగ్మతలు సంభవించుచున్నవి. ఈ సౌభాగ్య శొంఠిని వాడిన ఆరోగ్యము చెడక తల్లియు బిడ్డయు సుఖముగ నుండగలరు. తల్లికి సమృద్ధిగ పాలుపడును.

**బుడ్డి రు. 2–0–0**

## ప్రమేహాంతకం

(తెల్లబట్టవ్యాధికి)

అనేక కారణములవలన స్త్రీలకు గర్భాశయము నుండి తెల్లటిద్రవము వెడలుచుండును. స్త్రీ జాతి యందు యీజబ్బు సర్వసాధారణముగనుండును. పసిపిల్లలకుగూడ యీవ్యాధి సంభవించుచున్నది. చిరకాలముగ యీవ్యాధివల్ల బాధపడువారి గర్భాశయము పుండగును. అట్టివారికి మేహజ్వరము, దగ్గు, నిస్సత్తువ, సంతాన హీనత సంభవించును.

**బుడ్డి రు. 4–0–0**

# కేసరి కుటీరం లిమిటెడ్

**15, వెస్టుకాట్ రోడ్డు, రాయపేట, మద్రాసు 14**

**తెనుగుజిల్లాలకు, నైజామునకు ఏజంట్లు**

**సీతారాం జనరల్ స్టోర్సు, బెజవాడ – సికిందరాబాదు**

# గృహలక్ష్మి

స్త్రీల ఆరోగ్య సౌభాగ్యములను
పెంపొందించుట కేర్పడిన
సచిత్ర మాసపత్రిక


వ్యవస్థాపకులు

డాక్టరు కే. యన్. కేసరి

ఆక్టింగ్ ఎడిటర్
సి. సి. వున్నయ్య



సంపుటము ౨౩]   నవంబరు 1954   [సంచిక ౧౧




# విషయసూచిక





భక్తి ప్రేమలతో రూపొందుతున్న పూలమాల




జయజయ గృహలక్ష్మి సఖి ! జయజయ లలితాంధ్ర ! మధుర సారస్వతిమా !
జయజయ లలనా రత్నమ ! జయజయ విద్యాప్రబోధ ! జయకల్యాణీ !



# ఆసియా రాజ్యాల సమాఖ్య

పండిత నెహూౄ చైనా పర్యటన ప్రపంచ రాజకీయాలలోనే నవచైతన్యానికి కారణమయింది. చిత్తశుద్ధితో ప్రపంచశాంతిని, అభ్యుదయాన్ని కోరుతున్నదెవరనేది యీ పర్యటనా విశేషాలు ఎలుగెత్తి చాటినవి. మన దేశంలాగనే విదేశీయుల దోపిడి నుండి విముక్తిచెంది తమ అభ్యుదయ, అభివృద్ధులకు పాటుపడుతున్న నవచైనా మన దేశానికి అన్నిరంగాలలో మార్గదర్శకమై, యీ రెండు దేశాల మధ్య సన్నిహిత సంబంధ బాంధవ్యాలు ప్రపంచంలో శాంతిస్థాపనకేమి, సమరస సద్భావాలు పెంపొందడానికేమి విశేషంగా దోహదంకాగలవని నమ్మవచ్చును.

చైనాదేశీయులు భారతీయులవలె శాంతికాముకులు. నవచైనా రాజ్యాంగ ఆధిపత్యంలో వారు ప్రతియొక్కరు తమ పురోభివృద్ధి నుద్దేశించి నడుంబిగించినవారు. యుద్ధాలైనా, అరాజకమైనా అభివృద్ధి నిరోధకములని గడచిన అనుభవాలను బట్టి వారికి తెలుసు. వారిలాగే అభివృద్ధి చెందవలసిన మనలను, మన దేశాన్ని సానుభూతి సద్భావాలతో అభిమానించి సహకార సహాయాలతో మనకు తోడ్పడగలరు.

సాంస్కృతికంగా చైనా, భారత దేశాల సంబంధ బాంధవ్యములు యీనాటివి కావు. ఉభయ దేశముల నాగరకతా ప్రభావచిహ్నాలు పరస్పరం కనుపిస్తూనే యుంటవి.

చైనాలో పర్యటన సందర్భమున అచ్చటి ప్రజానీకం చూపిన ఆదరాభిమానములు, వారికి ప్రపంచ పరిస్థితులనుగురించి కల అభిప్రాయములు మరింతగా చైనాభారత దేశ సంబంధములను సన్నిహితంచేసినవి. ఈ రెండు దేశాలు అభ్యుదయ శక్తులుగా తమ యొక్క పురోభివృద్ధిని తీర్చిదిద్దుకుంటూ, తోటి ఆసియా రాజ్యాలను కూడగట్టుకొని ప్రపంచ కళ్యాణమునకు తోడ్పడగలవని ఆశిద్దాము.

---

# రాష్ట్రేతరాంధ్ర ప్రాంత్యాలు — రాష్ట్రప్రభుత్వాలు

మొదట ఒరిస్సా రాష్ట్ర నిర్మాణంతోటి ఆంధ్ర ఉత్తర సరిహద్దు ప్రాంత్యాలు - గంజాం, కోరాపుట్టి జిల్లాలు తెలుగుగడ్డనుండి విడదీయబడి ఒరిస్సాకు దత్తం చేయబడినవి. ఆంధ్ర రాష్ట్రం ప్రత్యేకంగా ఏర్పడిన ఫలితంగా బళ్లారి ప్రాంత్యము మద్రాసు పరిశిష్ట రాష్ట్రంలోని మరికొన్ని తెలుగుభాషా ప్రాంత్యాలు విడదీయబడి మైసూరుకు, పరిశిష్టరాష్ట్రానికి చేర్చబడినవి. దీనిఫలితంగా ఆయారాష్ట్రేతరాంధ్ర ప్రాంతాలలోని ప్రజానీకం భాష, సాంస్కృతిక, రాజకీయరంగాలలో పడేయిక్కట్లు, కోల్పోయిన హక్కులు, అవకాశములు గమనించతగినవి.

భాషాప్రాతిపదికపై ఏర్పడిన రాష్ట్రాలతో ఆయా భాషాప్రాంతాలు చేరే అవకాశమును నిరాకరించడమువలన అవి ఎన్నటికి సమగ్రము కాజాలవు. తమ పురోభివృద్ధి నుద్దేశించి ఆయాభాషా ప్రాంతీయులు తమతమ భాషా రాష్ట్రాలతో చేరిపోవ నుద్దేశించినపుడు వారినే రాష్ట్రం అడ్డగించినా, నిర్బంధాజ్ఞలకు లోనుచేసినా 'అఘాయిత్యము కాగలదు కాని మరొకటికాదు.

స్వతంత్రజాతి కుండవలసిన అన్ని హక్కులతోబాటు ఒకేభాష, ఒకేసంస్కృతి గల భాషాప్రాంతీయులు తమ అభ్యుదయ, పురోభివృద్ధుల నుద్దేశించి తమ భాషా రాష్ట్రంలో నుండగోరడమును రాష్ట్రప్రభుత్వాలేమి, కేంద్ర ప్రభుత్వమేమి సానుభూతితో ప్రజాభిమతాన్ని మన్నించితీరాలి. ఈ సందర్భమున మద్రాసు పరిశిష్ట

 

రాష్ట్రము, మైసూరు, ఒరిస్సారాష్ట్రములు విజ్ఞతతో వ్యవహరించి ఉమ్మడి సమస్యల పరిష్కారమును మరింత సౌలభ్యముగా నొనరింతురుగాక!

మద్రాసు నగర భవిష్యత్‌నుగురించి పరిశిష్టరాష్ట్రం ఏవిధంగాతలచినా ఒకటి మాత్రం యదార్థము - నగరంలోనున్నవారు ఒక్క తమిళులు మాత్రమేకాదు. వివిధభాషా ప్రాంతీయులు కలకాలమునుండి నివాసము లేర్పరచుకొని యున్నారు. వారి ఉమ్మడిహక్కులు, అవకాశముల రక్షణతోబాటు యథేచ్ఛమైన నగరపురోభివృద్ధికి మద్రాసు నగరం ప్రత్యేకంగా ఉమ్మడిరాష్ట్రం కావడం వాంఛనీయము. దాని వలన ఏభాషాప్రాంత్యపు హక్కులకు అవకాశములకు భిన్నము కలుగదనునది గమనించ తగినది.



శ్రీమతి
యం. యస్. సుబ్బులక్ష్మి

సుమారు 25 సంవత్సరములనుండి సాంప్రదాయ సిద్ధమగు కర్నాటక సంగీతాన్ని పాడుతూ, విశేషంగా సత్కార సన్మానాలు పొందుతూ కళారాధకురాలుగా భారత అధ్యక్షునిచే 'పస్మవిభూషణ' బిరుదు గడచిన స్వాతంత్ర్య దినమునాడు పొందిరి.

# మనము - మన రేడియో కేంద్రము - మన సాహిత్యాభివృద్ధి

డా॥ ప్రకాశచంద్ర శతపథి

"ఆంధ్రదేశపు సంగీతం, లలితకళలు, అతిపురాతనమై సర్వాంగ సుందరమైనవి. అసాధారణ సాహితీ సంపత్తి, కళాసంపత్తికలది ఆంధ్రదేశము. కనుక బ్రాడ్ కాస్టింగు విధానములో ఆంధ్రదేశపు అవసరములను ప్రత్యేకముగా గుర్తించుట సమంజసమైనది. ఆంధ్రులందరు మనస్ఫూర్తిగా సహాయపడుతూ అన్ని విధములా తోడ్పడగలరని ఆశిస్తున్నాము. అట్టి తోడ్పాటుకలిగినప్పుడే రేడియో కేంద్ర కార్యక్రమములద్వారా తెలుగుభాషలోని తీయదనము, సాహితీ సాంప్రదాయ ఉత్తమ లక్షణములు నలుగడలా వ్యాపించగలవు. రేడియో శ్రోతల సంఖ్య నానాటికి యెక్కువై, పట్టణములలోనూ, పల్లెలలోనూ నివసించు బీదసాదలందరు రేడియోను విని ఆనందించగలిగినప్పుడే మనశ్రమ ఫలించినట్లౌతుంది." విజయవాడ రేడియోకేంద్ర ప్రారంభోత్సవ సందర్భంలో భారత ఉపప్రధాని కీ. శే. సర్దార్ వల్లభాయ్ పటేల్ గారు అన్న వాక్యాలు విని పులకాంకితుడుకాని ఆంధ్రుడులేడు. ఆంధ్ర రేడియో కేంద్ర నియామకంద్వారా ఆంధ్రుల సర్వతోముఖ వికాసానికి దోహదం చేకూరినదనే ఆశ పొడజూపినది. ఆంధ్రభాష క్రొంగొత్తరీతుల వికాస మందగలదనే ఆనందం జనించింది. మేధానిధులు - ప్రజ్ఞావంతులు - విజ్ఞాన భావుకులు - పాండితీ ప్రజ్ఞులునైన ముఖ్యుల - సాహితీస్రష్టల, సాంస్కృతిక ప్రతిభుల - కళాభిజ్ఞుల - విశయ దైశద్యము, పాండితీగరిమ వెల్లడై, వినికిడై, యెంతో విజ్ఞానం - యెన్నో విశేషాలు - తెలిసి, యెంతో చైతన్యం ఆంధ్ర ప్రజలలో వెల్లివిరుస్తుందని మహోత్సాహం జనించింది. ఆంధ్ర సాంస్కృతిక, వికాసానికి ఒక దర్పణంలో, ఆంధ్ర సాహిత్య పెంపుదలకాక భువన విజయమండపంలా ఉపకరిస్తుందనే ఆ కాంక్ష జనించినది. ఆంధ్ర సాహితీశాఖలు నవపుష్పఫలభరితములై విరాజిల్లి నిరతానందము నియ్యగలదనే ఆశ పెంపొందినది. విజయవాడ రేడియో కేంద్రం — ఆంధ్రదేశ సాహితీ కళలకు యెంతయేని ప్రోత్సాహం యిస్తుందని — ఆయాకళా శాస్త్ర సాహిత్యాలలో నిపుణులైన వ్యక్తుల కెంతయేని దోహదమియ్యగలదని జనించిన భావం, కడకు అత్యాశగానే మిగిలిపోయినది. కానీ యీ ఆశ, దురాశ మాత్రం కాదేమోననే భావం — కేంద్ర ప్రభుత్వంవారు భారతదేశములోగల 21 రేడియో కేంద్రాలలో ప్రసారితంఅయ్యే ఆయా భాషల ప్రోగ్రాం విషయమై తగుశ్రద్ధగైకొని తగు విధముగా సంస్కరించదలచి ఆయా భాషా సాహితీ సాంస్కృతికలకు ప్రోత్సాహపర్చదలచి, లిటరరీ అడ్వైజర్సును నియమించడంవలన — ఆశ అంకురించినది. ఆంధ్రభాషా సాంస్కృతికలకు సలహాదారుగా శ్రీ పింగళి లక్ష్మీకాంతముగారు 1954 నుండి నియమింపబడినారు. వారు పదవినిచేబట్టి 9 మాసములయినది. వీరి అజ్మాయిషీలో తెలుగు భాషలో ప్రసారంజరిగే-విజయవాడ, హైద్రాబాదు, మద్రాసు రేడియో కేంద్రాలు జతపర్చబడినవి. వీరి సలహా ప్రధాన కేంద్రం — విజయవాడ రేడియో కేంద్రం.

ఈ సలహాదారు కర్తవ్యాలలో — దేశమునందలి ప్రముఖ సాహితీపరుల, సాంస్కృతికపరులచే చక్కని కార్యక్రమముల నేర్పాటు చేయించుట, ఆయారంగములలో అభినివేశంగల వారలచే ఉపన్యాసముల నిప్పించుట, చక్కని నాటకముల, నాటికల ప్రసారం చేయించుట ముఖ్యమైనవికలవు. ఈ సలహాదారులైనా — తమ కర్తవ్యాల్ని జయప్రదముగా నిర్వహించి, నిర్వర్తించవలెనన్న — ఆ వ్యక్తికి ఆ భాషా సాహితీ ఉద్యమముల గ్రహింపు ఉండుటవసరము. ఆ భాషా ప్రాంతములోగల కవుల, సంస్కృతీపరుల, సాహితీవేత్తల అనుపానులు తెల్సియుండవలెను. ఆ ప్రాంతములోగల సాహిత్య సాంస్కృతిక ఉద్యమాలతో సంపర్కము కల్గియుండియుండవలెను. స్వతహాగా — సాహిత్యమునందలి సమస్త శాఖలయందునను పేర్కొనదగిన ప్రాభవముండియుండవలెను. అప్పుడుగాని, ఆ వ్యక్తికి — దేశములోగల సాహితీపరులెవరెట్టివారో, ఎందరెందరే యే విషయ

ములలో ప్రజ్ఞనార్జించినవారలలో గ్రాహ్యము కానేరదు. ఇట్టి ప్రజ్ఞాసంపత్తిలేనివారు సలహాదారులైన యెడల ఆయాభాషా సాంస్కృతికలకెట్టి అభ్యున్నతియూ చేకూరదు. ఏవిజ్ఞానకు తగిన మన్నన లభ్యపడదు. ప్రతాప రుద్రీయములోని పేరిగాని పాలసాలాలనలే సాహితీపరులకో, సంస్కృతీపరులకు లభ్యమౌతుంది. ఇక ఆ రేడియో కేంద్రంవలన ఆ భాషా ప్రాంతానికికలిగే అభ్యున్నతి ఆయాకళలకు కలిగే దోహదము పూజ్యమే.

## విజయవాడ రేడియో కేంద్రం స్థితి:-

సాహితీ సలహాదారుపదవి సృష్టింపబడి, వారి ఆజ్మాయిషీ యేర్పడి 9 మాసములయినవి. ఈ నవమాసములలోనూ ఆంధ్ర సాహిత్యమునకు ఒనగూడిన అభ్యున్నతేమియూ లేకపోగా — ఆంధ్ర సాహిత్య శాఖలలో సభాపతులనదగిన శ్రీ శివశంకరస్వామి వారిబోలు వివిధ భాషాపాండితుల నవ్యసాహిత్య స్రష్టల, సాహిత్య పరిషత్ బ్రహ్మల బంగారుగొంతు వినబడలేదు. మహాకవి త్రిపురారిభట్ల వీరరాఘవ స్వామిగారిపలుకు వినరాలేదు. ప్రజ్ఞానిధులైన చింతాదీక్షితులు, ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి, నోరి నరసింహశాస్త్రి, దీపాల పిచ్చయ్యశాస్త్రి, వెంకట పార్వతీశ్వరకవులు, శతావధాని దోమా వేంకట స్వామిగుప్త, కొత్తపల్లి వీరభద్రరావు, కొప్పరపు సోదరకవులు, పుట్టపర్తి సంపత్, వేదుల సత్యనారాయణశాస్త్రి, శ్రీ పాద సుబ్రహ్మణ్యశాస్త్రి, జంధ్యాల పాపయ్యశాస్త్రి, భమిడిపాటి కామేశ్వరరావు, అనంతపంతుల రామలింగస్వామి, మధునాపంతుల, మహాపండిత కవులైన మధ్య శ్రీ కాశీ కృష్ణమాచార్యులబోటి ప్రముఖుల సాహితీలతా సౌరభం వినరాలేదు. ఆధునిక యువకవులైన — అనిశెట్టి, బెల్లంకొండ రామదాసు, యేల్చూరి సుబ్రహ్మణ్యం, అవసరాల సూర్యారావు, శ్రీనివాస చక్రవర్తి, వావిలాల సోమయాజులు మున్నగువారల సాహిత్య సోయగము కానరాలేదు. పువ్వాడ శేషగిరి, నాయని సుబ్బారావుగార్లబోలిన వారి మృదుమధుర సాహితీ సోయగం కానరాలేదు. ఆయా కళలలో ప్రముఖులైన వ్యక్తులమాటే వినరాలేదు. ఇకపోతే యీ నవమాసాలలోనూ బహుముఖ ప్రజ్ఞాలైన కవి సామ్రాట్ విశ్వనాథ సత్యనారాయణ, వేలూరి శివరామశాస్త్రి, కవిసార్వభౌమ శ్రీ పాద కృష్ణమూర్తి శాస్త్రిగారలు, అబ్బూరి రామకృష్ణారావు, కోపల్లె శివకామేశ్వరరావు, గడియారం వెంకట శేషశాస్త్రి, కాటూరి వెంకటేశ్వరరావు మున్నగు వారల కార్యక్రమం ఒకే ఒక్క సారి జరిగినది. విఖ్యాత పాండితీ ప్రాభవంగల శ్రీ కాంచనపల్లి కనకాంబ, శ్రీమతి బెల్లంకొండ రాజేశ్వరమ్మ, బత్తుల కామాక్షమ్మ బోంట్లవారి కవితా ప్రాభవము శ్రోతలచే వినపడలేదు. యువకవులైన సరస్వతీపుత్ర పుట్టపర్తి నారాయణాచార్యులు, పిల్లలమర్రి వెంకట హనుమంతరావు, ధూళిపాళ్ల శ్రీరామమూర్తిగార్లబోటి వ్యక్తుల కవితా శక్తి ఆస్వాదించు నవకాశము శ్రోతల కంతగా లభ్యపడలేదు. విజయవాడ రేడియో కేంద్రమువలన యీ నవమాసములలోనూ ప్రామాణికమైన యేసాహిత్య రచనగాని, సాహితీ విశిష్టతను వెలిబుచ్చిన నాటికగాని, నాటకముగాని, సృష్టింపబడలేదన్న మన రేడియో కేంద్ర ప్రయోజన మెట్టిదో విజ్ఞులకు తెలియక పోదు.

ఈ నవమాసములలోనూ ఆంధ్రదేశములో యే ఒక్క ఉత్తమ రచయిత రచనా శక్తినిగాని, మేధావంతుని ప్రజ్ఞాపాటవమునుగాని రేడియో కేంద్రము బహిర్గత పర్చినదిలేదు. అర్హులైనవారల అమడదూరమునకునెట్టి తద్భిన్నుల అన్నిటికిన్ని గైకొనుటయే కారణమనునది కాదనరానిది. ఈ నవమాసములలోనూ జరిగిన సాంస్కృతిక ఉపన్యాసముల పట్టికను పరిశీలించిన ఆంధ్రదేశములో సంస్కృతీపరులైన వారు శూన్యులని యెవరైనా భావించగల్గినంత నికృష్టముగా ప్రోగ్రాములు ప్రసారమయినవి. మరి యీ పనంతా సలహాదారుగారి ఆజ్మాయిషీలోనే జరిగినదో, లేక విజయవాడ రేడియోకేంద్ర అధికారులే జరిపించినారో తెలియదు. లేక అభిమానం, ఆశ్రిత పక్షపాతం, బంధుప్రీతి, స్నేహవాత్సల్యం, కక్షాభి

మూనాల ఆధిక్యతే యీ ప్రసారాలకు కారణమో! ఏమైనా విజయవాడకేంద్ర ప్రసారాలు మాత్రము ఆంధ్ర సారస్వత సౌష్టవమునకేమాత్రము ఉపకరించు నవిగా మాత్రములేవు.

రేడియోమాస ప్రసారాలు:-

గాంధీజయంతి అక్టోబరు రెండవ తేదీనుండి ఒక మాసము "రేడియోనెల" పేరిట కేంద్ర బ్రాడ్ కాస్టింగు శాఖవారు ఒక ఉత్సవం మొదలిడినారు. దేశములోగల 21 రేడియో కేంద్రాలనుండి ప్రశస్తమైన ప్రసారాలు ప్రఖ్యాత నటకులవీ, గాయకులవీ, వీను మిగిలిన విద్వాంసులవీ ప్రోగ్రాంలు ప్రసారం కాబడతాయి అని వెల్లడించినందువలన విజయవాడ కేంద్రంనుండికూడా యీ సౌభాగ్యం సమకూరుతుంది గదాయని ఉవ్విళ్లూరినాము. కానీ మన రేడియో ప్రోగ్రాములు చూచినా, ప్రసారాలువిన్నా, యీ ఉత్సాహం_ఉల్లాసం_మరింతగా దిగనారిపోతుంది. రేడియోనెల ప్రోగ్రాంల ఉత్సవంవలన దేశంలో మరింతగా రేడియోల సంఖ్యాబాహుళ్యం, రేడియో ప్రోగ్రాములయెడ అత్యంతాసక్తి, యేర్పడుతుందన్న ఆశ నిరాశగానే వుండిపోయినది.

ఈ రేడియోనెల ఉత్సవ సందర్భంలోనైనా మన విజయవాడ రేడియో స్టేషనునుండికూడా ఎందరో ప్రఖ్యాతకవుల, మరెందరో విద్వత్ పురుషుల, సంస్కృతీపరుల, మేధావంతుల_ఎన్నో కొత్త కథలు, మరెన్నో కొత్త నాటకాలు, యింకెన్నియో ప్రబంధాలు, మరెన్నో సాంస్కృతిక రచనలు, యెందరినో కవుల రప్పించి, మరెందరినో సాహితీ ప్రజ్ఞుల తోడ్తెచ్చి, సమాలోచించి, వారితో చర్చించి, వ్రాయించి, వినిపించడం జరిగి మనభాష సుగంధ పుష్పాలంకృతమై, మధుఫలభరితమై, మనోల్లాస దాయకంగా రాణింపు జరుగుతుందని ఆసించాం. కానీ సాహితీ లక్ష్యాన్ని నిరూపించే ఒక్క రచనగాని, సాహిత్య ప్రయోజనాన్ని వినిపించే ఒక్క రచనగాని, ఆంధ్ర సాంస్కృతిక ప్రాభవాన్ని ఉగ్గడించే ఒక్క ప్రోగ్రాంగాని ఆంధ్రదేశ సాహిత్య సాంస్కృతిక ఔన్నత్యాన్ని బహుముఖాలుగా పేర్కొని యేఒక్క ప్రజ్ఞ ధ్రువీకరించబడలేదు. ప్రదర్శించగా వినలేదు. ఆయా సాంస్కృతిక రంగాలలో, ఆయా సాహిత్య శాఖలలో నిష్ణాతులైన వారలప్రజ్ఞ యీ రేడియోనెలలోనైనా ప్రదర్శితం కాబడుతుందని యెంతయో ఆసించడం జరిగింది. ఇతర రేడియోకేంద్రముల ప్రోగ్రాములు, ప్రసారాలు జూచిన పిదప విజయవాడ రేడియో ఉత్సవ కార్యక్రమాన్ని పరిశీలిస్తే ఖేదమొదవక మానదు.

విజయదశమి (7.10.54) నాడు విజయవాడ రేడియో స్టేషన్నుండి "శారదా మందిరమ్" అన్న శీర్షికక్రింద కవిసమ్మేళనం జరిపారు. విజయదశమి ప్రాశస్త్యాన్నిగూర్చి, శక్తినిగూర్చి పదిమంది కవులచే పద్యపఠనం జరిపించారు. అందు శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి, గడియారం వెంకటశేషశాస్త్రి, విశ్వనాథ సత్యనారాయణ, రాయప్రోలు సుబ్బారావు, గుర్రం జాషువా, వెంచర్ల రామకృష్ణయ్య, తుమ్మల సీతారామమూర్తిచౌదరీ, కందుకూరి రామభద్రరాజు, నండూరి చంద్రమతి, శ్రీ. శ్రీ. పాల్గొన్నారు. రేడియోనెల ఉత్సవ సందర్భంలో వచ్చిన విజయదశమి నాటి కవిసమ్మేళనంలో ప్రబంధకవితా శాఖకు చెందిన కవులు, విఖ్యాతులైనవారలు, పాండితీ ప్రజ్ఞావిలసితులైనవారు పాల్గొనియుండిన రాణింపు నకు వచ్చియుండెడిది. శ్రీ వేలూరి శివరామశాస్త్రి, స్వామీ శివశంకరులు, నోరి నరసింహశాస్త్రి, వెంకట పార్వతీశ్వరకవులు విధిగాయుండి యుండవలసినది. దేవీస్తుతి కవి సమ్మేళనాంశమైనపుడు దేవీ భాగవ తాంధ్రకర్తయైన కవిసమ్రాట్ నోరి నరసింహశాస్త్రి గారిని విస్మరించియుండవలసినది గాదు. రాయప్రోలు సుబ్బారావు, జాషువా, కందుకూరి రామభద్రరాజు, నండూరి చంద్రమతి, శ్రీశ్రీలకు ప్రోగ్రాం యియ్యడమే తలంపైయున్నట్లయితే మరో ప్రోగ్రాం కల్పించి యుండవలసినది. అంతియేకాని వీరిని పైప్రోగ్రాంలో చేర్చడంవలన ఆ కార్యక్రమం నీరసించిపోయినది.

రక్తిచెడినది. అధ్యయనుని అధ్యాపకునికలసి కావ్య పఠనం చేయమన్నట్లు రూపొందినది. ఇంతటి ముఖ్యమైన ప్రోగ్రాంలో ప్రౌఢకవులను విస్మరించడంలో - సాహితీ సలహాదారుగారే ప్రయోజనాన్ని సాధించ తలపెట్టినారో తెలియుటలేదు. పద్యకవిత కొందరిదీ - గద్యకవిత కొందరిదీ - లఘుకవితా కుమారికలు, సహజకవితా సరస్వతులుగా గురుకవిత వల్లింపు, - యీ విధంగా ఆ నాటి కవిసమ్మేళనం నడకసాగించినది. రశికులైన శ్రోతలు చెవులు మూసుకొనవచ్చినది. విశ్వనాథ, గడియారం, తుమ్మలలది మినహా మరెవరిదీ వినశక్యంకాలేదు. శ్రీశ్రీ గద్యకవిత కలకలలాడి ఉల్లాసమిచ్చినదే ఐననూ పద్యకవిత పద విన్యాసాలలోపడి పసిమి చిందజాలకపోయినది. గుండ్రటి రంధ్రములో నలుచదరపు కొయ్యవలె సరి పడనిదైనది. అంతియేకాని శ్రీశ్రీని వినూతనపర్చడం నా అభిమతంకాదు. స్త్రీలలో నెవరినైన సమ్మేళనంలో చేర్చడం సబబేనని భావించినట్టయితే సంస్కృతాంధ్రముల ప్రౌఢకవిత నాలపించగల్గిన శ్రీమతి బెల్లంకొండ రాజేశ్వరమ్మగారినిగాని, శ్రీ కాంచనపల్లి కనకాంబగారినిగాని చేర్చియుండవలసినది. ఐతే ప్రత్యేకాభిమానములందు కంగీకరించలేదేమో! లేక మొదటనే చెప్పినట్లు ఎవరెవరెట్టి కవితాశైలి నలవర్చుకున్నవారలో — ఎవరెవరెట్టి సాహితీ సంపన్నులో సాహితీ సలహాదార్లు పరిశీలించనివారైనా అయియుండాలి. ఏమైనా విజయవాడ రేడియో కేంద్రమున — అర్హతకుగాక అభిమానమునకు, శక్తికిగాక వ్యక్తికి, ప్రజ్ఞకుగాక పదభక్తికి గణ్యత లభిస్తున్నదని అనుకొనక తప్పనిస్థితి దాపురించినట్లున్నది. ఈ దుస్థితి బాసినగాని ఆంధ్రసాహిత్య సాంస్కృతికలకు విజయవాడ రేడియో కేంద్ర మేవిధముగను ఉపకరించ జాలదని మనవిచేయక తప్పదు. విజ్ఞులైన ఆంధ్ర ప్రముఖులీస్థితిని కొనసాగనీయకుందురుగాక.

—o—

ఒకజ్యోస్యుడు "మీరనుకున్న పని కాదండీ"

"అలా అయితే నేననుకున్నది మీకు అయిదు రూపాయలిద్దామని"

♦ ♦ ♦

"ఏమే సీతా! నీ తలవెంట్రుకలు బెంకాయ పీచుల్లాగున్నవి"

"అలాగైతే రేపు మీ పాత్రలు తోమడాని కుపయోగపడ్తుందిలేండి"

♦ ♦ ♦

"నీవువట్టి తెలివితక్కువ పెద్దమ్మవని ముఖమే అద్దంలాగ చూపుతున్నది"

"పొరబడుతున్నారు — నాముఖమే అద్దమయితే అందులో మీరు చూచేది మీ ప్రతిబింబమే"

♦ ♦ ♦

ఒక గుమాస్తా "రాను రాను మన మేనేజరు కుక్కలాగ మొరుగుతున్నాడు"

మరొక గుమాస్తా "నీవు ఆయన దగ్గర తోక ఆడించి యుంటావు"

♦ ♦ ♦

"బయట ఎవరో బిచ్చగత్తె గొంతు చించుకుంటున్నట్లుంది-యీ కానీ‌ఇచ్చి పంపెయ్యి"

"బిచ్చకత్తె కాదు బాబయ్యా! ఎదురింటి అమ్మగారు పాటపాడుతున్నారు."

ఆర్. కృష్ణమూర్తి

## శ్రీమతి దేశిరాజు భారతీదేవి

# కాంతాశతకము

---o---

పండిత వేదము వేంకట కృష్ణశర్మ

ఈ కవయిత్రీమణి గుంటూరుజిల్లా బాపట్ల పుర వాస్తవ్యురాలు. కృష్ణయజుశ్శాఖకుఁ జెందిన ఆరువేల నియోగి బ్రాహ్మణ కుటుంబమున, క్రీ. శ. 1915 (రాక్షస సంll ర ఆషాఢ మాసమున) జననమందినది. తండ్రి శ్రీ చంద్రమౌళి చిదంబరరావు; తల్లి కీ. శే. శ్రీమతి అన్నపూర్ణమ్మ. వీరి గోత్రము 'వత్సస'- ఈ సాధ్వీతిలకము భర్త, గ్రామకరణికము వృత్తిగాఁగల శ్రీ దేశిరాజు రామచంద్రరావుగారు. వీరి గోత్రము 'కౌండిన్యస' - (ఇప్పటికీ సజీవులే ఈమె తండ్రి చిదంబరరావుగారు.) ఈయమ తన శతకమునః-

"వేదవేదాంతాది విద్యా రహస్యముల్
వెలయించు గ్రంథముల్ తెలుఁగుచేసి,
రాఘవ శంకర రాజ రాజేశ్వరీ
శతకముల్ విరచించి శక్తినెఱపి,
ఆంధ్రాంగ్లభాషల నచ్చంపు శేముషీ
విభవంబు నార్జించి పేరుగాంచి,
దేశస్వతంత్ర సందేశంబు వ్యాపింప
పద్యనాటకముల వ్రాయఁగల్గి
చంద్రమౌళి వంశమునందు జననమంది,
ప్రౌఢ కవితాధురీణుఁడై వాసినంది
అవ్యయానందసార చిదంబరాఖ్య
వటులు నాతండ్రి కొనరింతు వందనంబు"

అని తన పితృపాదులను గీర్తించుటచే, నీమె కాతనియందలి (పితృ) భక్తి అనన్య సామాన్యమయినదని యూహింపవలసియున్నది. కాని మొల్లమాంబవలెనే తన పతినామమెందును సూచింపమి, భర్తృనామ ముచ్చరించుటకు సంకోచించు భారత నారీమణుల చిరసంప్రదాయమును బాటించెనని సమర్థించుకొనవలసి యున్నది. * ఈమె కిరువురు పుత్రులు, నిర్వురు పుత్రికలుగలరు.

ఈయమ తన జనకుఁ డనేక కృతులకుఁ గర్తగాఁ బేర్కొనుటచే, నతనివలననే, భాషా ప్రావీణ్యమును గవితాశక్తియు గడించుటయు నీమె యసమాన పితృభక్తికిఁ గారణముగా నోపును. ఈమె తండ్రి, రాఘవ–శంకర, రాజరాజేశ్వరీ శతకములు చేసినట్లు పైసీసపద్యమున సూచితము. అవియు లభించునేని, నా శతకవాఙ్మయ సంపుటము: ద్వితీయభాగమందయిన - శ్రీ చిదంబరరావుగారి యొక్కయు - వారి శతకములయొక్కయు సంగ్రహ చరిత్రము ప్రచురింప వీలగును.

ప్రకృతమీ కవయిత్రి-కాంతాశతకము, ముక్తాంబ (ఏకాంక నాటిక,) శ్రీకృష్ణమహిమార్ణవము (గద్య ఖండ కావ్యము,) శాకుంతలము (విమర్శనము) - వ్రాసినట్లు తెలియుచున్నది. – అందు మనకిపుడు ప్రసక్తమయినది "కాంతాశతక" విషయము.

---

* వేదయుగమునఁగాని, పురాణయుగమునఁగాని - ఆర్యదంపతుల కిట్టి యాచారమున్నట్లు కానరాదు. ఇపుడిపుడిట్టి యలవాటు పాశ్చాత్య సంస్కృతిచేఁ గొలఁది కొలఁదిగ నాగరకులలోఁ దొలఁగుచుండినను, బల్లెపట్టులలోని పూర్వాచార పరాయణులలోఁ బీఁటవెట్టుకొనియే యున్నది. ఇందులకు యువతీ యువకులయిన దంపతులకుఁగల బలవత్తరమయిన లజ్జయు, సంఘమేమనుకొనునోయను జంకును గారణములుగావచ్చును.

614 పేజీ చూడుడు

# మా ఆవిడ రొఖ్ఖిబేరం!

డాక్టర్ 'గిరి'

'చీరలమ్మా చీరలు... బెంగుళూరు చీరలు, బనారసు చీరలు, కోయంబత్తూరు చీరలు, జరీ చీరలు, సిల్కు చీరలు, జాకెట్టుగుడ్డలు - పరికిణీ గుడ్డలు...' యింకా యేవో వాడి తలకాయగుడ్డలు అని ఏకరువు పెడుతూన్న కేకవినబడిందో లేదో - వంటయింట్లో యేదో పనిచేసి కొంటూన్న మా గృహలక్ష్మి 'కాంతం' - అంటే నా భార్య అన్నమాటలెండి - తన పుట్టింతా మునిగి పోయినట్లు, అంట్ల చేత్తో అలాగే పరుగెత్తుకొంటూ, ఒక్క దూకుడున వీథిగుమ్మంలోకి దూకి 'ఓయ్ చీరలబ్బీ — ఇదిగో ఓ చీరలాయనా! యిలాగా' అని మా ఇంటిని దాటి పోతూన్న చీరలవర్తకుడిని పిలచింది. తనవల్లనే యీ స్త్రీలోకమంతా దిగంబరులు కాకుండా యిలా నిలబడి ఉంది అనే మనోగర్వం వ్యక్తపరుస్తున్నట్లు, తన చేతిలోని గజంబద్దను యిలా — అలా త్రిప్పుకొంటూ, తనవెంట చీరల మూటను మోసికొని వస్తూన్న కూలి వాడితో కూడా మాయింట్లో ప్రవేశించాడు చీరల వర్తకుడు.

సాధారణంగా మా ఆవిడ చీరల వర్తకుని పిల్చిందంటే — వాడిని ఎప్పుడూ 'ఉత్త' చేతుల్తో పంపే అలవాటులేదు. ఆవేళ నాచేతిలో ఎర్రని ఏగాని అయినాలేదు. ఈ పరిస్థితి తల్చుకొనేసరికి నాగుండెల్లో ఊయిపడింది. 'ఏమిదారి భగవంతుడా' అనే విచారం పట్టుకొంది నాకు. ఈ విచారమునకు పర్యవసానంగా ఆ చీరల వర్తకుని మీద పట్టరానంత ఆగ్రహం కలిగింది. 'ఈవెధవలకు వేరేమీ పనీ - పాటూ లేదు కామోసు. రోజూ - ప్రొద్దస్తమానం వీళ్లకిదే గోల. 'ఖర్మం' చాలక చీరలమాట మరచిపోయిన ఉత్తమ యిల్లాండ్రను కూడా రేపెడుతూ, ఆచీరలు ఈ చీరలుఅని వర్ణించి-వాళ్లనుఊరిస్తూ, యీకష్టకాలంలో తిండికే సంపాదించలేక కష్టపడుతూన్నవాళ్ల భర్తలకీ వాళ్లకీ మధ్య మనస్తాపాలను కలిగిస్తూ, సంసార సుఖానికి అంతరాయం ఆపాదించగల యీ చీరల వర్తకులు వీథివీధి — సందు సందు విడిచి పెట్టకుండా తిరుగుతూ ఉంటారే! వీళ్లనేం చెయ్యాలి? నేనే యీ దేశానికే అధ్యక్షుణ్ణో, ప్రధానమంత్రినో, గవర్నరోన్నా - కనీసం ఎంతలేదన్నా ఒక పోలీసు సబిన స్పెక్టరోన్నా అయి ఉండి ఉంటే - ఇటువంటి వర్తకులను బహిష్కరించో, 'న్యూసెన్స్' ఛార్జి పెట్టో అణగ త్రొక్కే వాణ్ణికదా' అని నాలో నేను, స్వగతంగా అనుకొన్నాను. అనుకోడమేమిటి — నిశ్చయించుకొన్నాను. ఇంకానయం, నగలవర్తకులుకూడా బయలుదేరి బంగారుచైన్లు, బంగారుగాజులు, వజ్రాలకమ్మలు, రవ్వల ఉంగరాలు ... అని వీధుల్లో అరవడానికి ఆరంభించారంటే! - 'గ్రుడ్డిలో మెల్ల' అన్నట్లు వాళ్లు రాకపోవడం కొంతనయం అని అనిపించింది.

అప్పటికప్పుడే చీరలవర్తకుడు తన మూటనువిప్పేసి, జాకెట్టువగైరా గుడ్డల్ని ఒకవైపు, పట్టుచీరల్ని మరోవైపు, జరీవాటిని యింకోవైపు పేర్చిపెట్టి మా ఆవిడతో వాటివాటి ఔన్నత్యాన్నిగురించి వర్ణిస్తున్నాడు. 'ఇది సుమంగలి చీర, యిది మళ్లీపెళ్లి చీర, యిది సంసారం చీర, యిది జీవితం చీర...' అని అంటూ ఒక్కొక్క చీరకు ఒక్కొక్క పేరు చెబుతున్నాడు. చీరలేమో బాగానే ఉన్నాయి - గాని చాయ నిలుస్తుందోలేదో అనే అనుమానం నాకు కలిగింది. అదేసమయానికి మా ఆవిడకుకూడా ఆ అనుమానం కలిగి, అవును గాని - మరి చాయ 'గారంటీ' యేనా అని అడిగింది వర్తకుణ్ణి.

'అదేమిటమ్మా అలా అడుగుతారు? చీరపోయినా చాయపోదనుకోండి. ఈ వీధిలోనే డజనుచీరలు ఎగిరిపోయాయి. అందరూ అయిస్క్రిమ్ బార్డర్నే ఎంచుకొన్నారు. మీ అదృష్టంకొద్దీ ఆ రకంలో యీఒక్క చీరే మిగిలింది' అన్నాడు వర్తకుడు.

'ఇదేమి చీరోయ్?' అన్నాను నేను మరోచీరను చూపిస్తూ.

‘ఇదాండి? దీన్ని సంఘం చీరంటారు.’ అన్నాడు వర్తకుడు.

‘అలా అయితే మరి నీ దగ్గిర అగ్గిరాముడు చీరలు కూడా ఉన్నాయన్నమాట’ అన్నాను నేను.

‘ఇంకా ఆ సరుకు రాలేదండి’ అన్నాడు వర్తకుడు చలాకీగానే.

మా ఆవిడకు వాటిలో అయిస్క్రీమ్ బార్డరు చీర నచ్చింది, గాని ఎంగిలిచేత్తో దాన్ని ఎలా ముట్టుకోడంగనక! అందువల్ల చీరలవర్తకుణ్ణి అక్కడే ఉండమనిచెప్పి చెయ్యి కడుగుకొనుటకని లోపలికి వెళ్ళింది. నేనుకూడా ఆమె వెనువెంట లోపలికి వెళ్ళాను. ఇద్దరం ‘హాలు’లోనికి ప్రవేశించిన తర్వాత నేను మా ఆవిడతో “సరేగాని, కాంతం! ఆచీరను తీసికోబోతున్నావా?” అన్నాను.

“అదేమిటలా అడుగుతున్నారు? బేరం పడిందంటే తీసికొంటాను” అంది.

“బేరం పడుతుందనే అనుకో - అయినా - మరి”

“అంటే !”

“అంటే డబ్బులేదుకదా - ఎలాగా అని చూస్తున్నాను”

“చాల్లెండి! మీ కెప్పుడూ యింతే! మీ నోటితో మీరు యెప్పుడైనా ‘ఈ చీరకొనుక్కో డబ్బిస్తాను’ అని అన్నారు గనకనా” అని నిష్ఠూరంగా అంది.

“అనే ఉందునో మానే ఉందునో ! ఏమనడానికైనా నాకో అవకాశం యిచ్చిఉంటేకదా ఆమాట. చీరలకేక వినీవినబడక ముందే నువ్వు తయారవుతావు. మొన్న ఎవడో ‘బీరకాయలు, బీరకాయలు’ అని అమ్ముతూఉంటే చీరలకలవరంలో ఉన్న నీ చెవులకు ఆ మాటలు ‘చీరకావాలా - చీ ర కా వా లా’ అన్నట్టుగా వినబడ్డాయికదా? బజారుకు నాతోవచ్చావంటే ఒక బట్టలదుకాణమన్నా ‘తనిఖీ’ చెయ్యకుండా విడిచిపెట్టవాయె. ఇంట్లో పెట్టెలనిండా చీరలు మడతలుమడతలుగా పడిఉన్నాయికదా? అటువంటప్పుడు చీరకొనుక్కోమని నన్నెప్పుడు - ఎలాగ అనమన్నావో చెప్పు.” అన్నాను.

“ఇంట్లో చీరలున్నాయికదా అని క్రొత్తఫాషన్ చీరలువస్తే కొనవద్దంటారా ?” అంది మాగృహిణి.

“నేనేమీ అనదల్చుకోలేదు. నాకెందుకాగోల. ఇవాళ మాత్రం డబ్బులేదు. నాకుతెలిసింది అంతే.” అన్నాను.

“అయితే మరెలాగ? ... ఒకవేళ వాడు అరువు యిస్తే తీసికోమంటారా ?” అంది మా యిల్లాలు. తాతాచార్యుల ముద్రలాగ యిది ఎలాగా తప్పేటట్లు లేదు. అందువల్ల “ఆ చీరలవాడు అప్పుగా యివ్వనంటే ఏంచేస్తావు ? ” అన్నాను.

“ఎందుకివ్వడేమిటి - అంత నమ్మక పోతాడా - రేపో ఎల్లుండో రమ్మంటాను. అంతలో యిల్లూవాకిలీ వదిలేసి పోతాననుకొంటాడా ?” అంది.

“అయితే నీయిష్టం.” అనేశాను. మా ఆవిడ పెరట్లోకి వెళ్ళి కొంతసేపైంది. అంతలో చీరలవర్తకుడు “అమ్మగారూ ! ఉండమన్నారా ? పొమ్మన్నారా ? ఒకయింట్లోనే యింతసేపైతే మావ్యాపారమెలాసాగుతుంది చెప్పండి” అన్నాడు. వర్తకుడు తొందరపడుతున్న విషయం మా ఆవిడతో చెప్పాలని నేను వంటగదివైపు వెళ్ళి - ఓరువాకిలిగా వేయబడిఉన్న తలుపుసందులోంచి చూచేసరికి, మా ఆవిడ అలమారుదగ్గరనిలబడి, లోహపు సోపుపెట్టెలోనించి ‘నోట్లు’తీసి లెక్కపెట్టుకోవడం కనిపించింది. అయిదురూపాయలనోట్లు, పదిరూపాయల నోట్లు నాకంటబడ్డాయి. అందుకే మా గృహలక్ష్మి అంత ధైర్యంగా చీరలవాడు అప్పుయిస్తాడని చెప్పగలిగిందని నేను గ్రహించాను. వెంటనే చడీ – చప్పుడూ లేకుండా మళ్ళీ హాలులోకి వచ్చి ఏమీ ఎరుగనట్లు కుర్చీలో కూర్చున్నాను. దీనికనీ దానికనీ అప్పుడప్పుడు నా వద్దనుండి అడిగిపుచ్చుకొన్న డబ్బును అలా దాచిపెట్టుకొంటున్నదని నా కారోజువరకు తెలియదు. ‘సరి! ఇప్పుడు మనం యిక్కడ ఉంటే మా ఆవిడ రొఖ్ఖ బేరానికి అడ్డంగా ఉంటుం’దని ఊహించుకొని - ఏదో మిషపెట్టి ఇల్లు విడిచాను. నేను తిరిగివచ్చేసరికి కాంతం ‘అయిస్క్రీమ్’ చీరను ధరించి నాకు స్వాగతమిస్తూ ‘చీరలవాడు పాపం – చాలా మంచివాడు సుమండీ – నామాట యిట్టే నమ్మేసి యీచీర ముప్పై రూపాయలకి అప్పుగా యిచ్చివెళ్ళేడు’ అంది. “అవును- అందుకనే నేను లేనిపోని పని కల్పించుకొని వెళ్ళిపోయాను. నేనుంటే యిలాంటి అప్పుచేయడం నీకు చాలా శ్రమగా ఉంటుందని నాకు మొదటే తెలుసు” అన్నాను.




శ్రీమతి స్థానాపతి రుక్మిణమ్మ

ధర్మకర్తగ నుండ తగవులాడుటెగాని - దైవమ్మునకు మ్రొక్కు తలపులేదు
దేవతా ద్రవ్యమ్ము తినివేయుటేగాని - కానైన నీయంగ కరము రాదు
పరధనాది హరణ పారీణతేగాని - స్వార్థపరిత్యాగ మాత్రలేదు
పరులు చెప్పెడిమాట పాటించుటేగాని - కల్లెంతో నిజమెంతో గనుటలేదు
నగుచు చేసేది పరపీడనమ్మెగాని - నెమ్మి సేయు పరోపకారమ్ము లేదు
పేరునకు పెద్దలైనట్టు వారి తీరు - లీవిధమ్ముగ నున్న వీయవనిలోన.
కారెక్కుటేకాని కాలిపోవుచునున్న - కడుపులు చల్లార్చు కరుణలేదు
పరమతాచారముల్ మురిసి బూనుటెగాని-తన కులాచారముల్ గనుటలేదు
తలకు తట్టినరీతి తప్పులెన్నుటెగాని - ఒప్పెట్టులో చెప్ప చొప్పలేదు
తనబాగు తనఠీగు తలపోయుటేగాని - పరగోడు పరికింప వోరవులేదు
తగుదునని ధర్మపన్నాలు తడయకెందు-చెప్పుటేగాని, అవి - సేయ చేతగాదు
అందఱముగూడ నొక్కటేయనుటెగాని,-వర్ణవర్గాభిమానముల్ వదలగాదు.

# పల్లె పదాలు

సేకరణ

శ్రీమతి గంగాధరభట్ల

కృష్ణ కృష్ణ అనియేవు కృష్ణు తలచేవు
కృష్ణుడేమి కావలెను శ్రీ రాధ కృష్ణా ?
అన్నగారి కొడుకు అతి సుందరుండు.
మేళంబులాడేటి మేనఅల్లుండు.

శ్రీరామ జయరామ శృంగారరామ
చారువిక్రమరామ చంద్రగిరిరామ
రామరామ అనియేవు రాము తలచేవు
రామేమి కావలెను రాఘవుల సీత
మా తండ్రి కల్లుడు మా అత్త కొడుకు,
భక్తితో సేవింప నా ప్రాణవిభుడు.

ఏడవకు ఏడవకు వెర్రి అమ్మాయి
ఏడిస్తే నీ కళ్ళ నీలాలు కారు,
నీలాలు కారితే నే చూడలేను
పాలైనకారవే బంగారు కళ్ళ.
పిల్లి రాయె తల్లి పిల్లలతల్లి
పల్లేరు ముళ్ళల్లో పడ వేసిపోవె.

చిన్న అమ్మాయి చిన్నగిరిమొగ్గ
వీధుల్ల నాడేటి విరజాజిమొగ్గ
ఆటమాణిక్యమే పాటమాణిక్యం
అందరికి అమ్మాయి రత్నమాణిక్యం
రత్నమాణిక్యము ఎవ్వరిపట్టి
రాజులచేతి దే గజనిమ్మపండు.

గాజుల్లసెట్టివోయి కనకాలసెట్టి
తేవోయి అమ్మాయికి తేనెగాజుల్లు
తేనెగాజుల్లసెట్టివో టెంకాయసెట్టి
నల్లగాజులసెట్టి మావాడరమ్మ,
మావాడకొచ్చి మాయింటికొచ్చి
మా కస్తూరికి గాజుల్లు తొడిగిపోవోయి.

చిన్ని మా అమ్మాయి సిరిమొగముచూచి
సిగ్గుపడి చంద్రన్న పొడవనే రాడు.
మరునాడు అమ్మాయి మాటల్లుచూచి
మాణిక్యాలతో పొడిచె సూరన్న
కోరి మా అమ్మాయి కన్నుల్లుచూచి
కలికి చందమామ కానరాడాయె.

అందరి మామల్లు దూరానగలరు
అమ్మాయి మామల్లు చేరువనగలరు
హాయి భోయల్లార ఓ, బాలలార,
మా బాల రాదుగా మీతోడ ఆడ.

పట్టమ్మ పేరేమి పల్లె పేరేమి ?
పట్టభద్రుని కన్న తల్లిపేరేమి ?
పట్టమ్మ ద్వారకా పల్లె రేపల్లె,
పట్టభద్రుని గన్నతల్లి యశోద.

ఊరులేలేవాడు ఉత్తముడు అయితే
పాలుపొంగినట్లు పొంగుదురు ప్రజలు,
ఉత్తముని పేరేమి ? ఊరుపేరేమి ?
సత్పురుషునికన్న తల్లిపేరేమి ?
ఉత్తముడు దశరథుడు ఊరు అయోధ్య,
సత్పురుషునికన్నతల్లి కౌసల్య.

అమ్మాయిన కొట్టిన కొట్లు ఊరెల్లరట్లు
అమ్మాయి నెవ్వరే కొట్టిన్నవారు ?
కొట్టి కొబ్బరిబెల్లం చేతికిచ్చారు,
వెండిది ఉయ్యాల పమిడిగొలుసుల్లు,
రామలక్ష్మి ఊపవే అమ్మాయి తొట్టి,
పట్టుపరుపులు పట్టుదిండ్లు,
అమ్మలూ ఊపవే అమ్మాయితొట్టి,

ముత్యాల బొట్టెట్టి పట్టుచీరగట్టి,
అటుకులు వడగట్టి ఆడిరమ్మందు,
ఆడబోయినచోట మాడ దొరికింది
మాడక్క చేయింతు మద్దికాయల్లు,
మద్దికాయలు ముద్దు మాటల్లు ముద్దు,
అందరికి అమ్మాయి అల్లారుముద్దు.

చిలుకలు చెలరేగి జీడికొమ్మెక్క,
అబ్బాయి చెలరేగి మామ బుజమెక్క
మామ బుజమెక్కి తానేమి అడుగు?
పాలుద్రావు గిన్నెడుగు పాడావునడుగు.
పంతముతో మేనమామ పట్టెను అడుగు.

చిలుకల్లు చెలరేగి జీడికొమ్మెక్క
అలుకతో అమ్మాయి అమ్మమ్మ చంకెక్క,
చిన్ని మా అమ్మాయి చీరకేడిస్తే
నెయ్యవోయి పాలీడ నేత్రానపట్టు.

చిన్నారి పొన్నారి గాజుల్లసెట్టి,
తేర మాఅమ్మాయికి తేనెగాజుల్లు,
దిష్టితగులాకుండ ముష్టిబొద్దుల్లు,
పరదిష్టిలొకాక పాలపూసల్లు,
నరదిష్టిలొకాక నల్లగాజుల్లు.

అమ్మాయి ఆటల్లు తండ్రులకుముద్దు.
మాటలు ఆడంగ మామలకుముద్దు.
అందరికి అమ్మాయి అల్లారుముద్దు.

వీధులా నాడేటి ఓ బాలలార
మా బాల నెందైన కంటిరా మీరు?
అమ్మ మీ బాలకు ఆనవాలేమి?
జడజడా రత్నాలు జడరావిరేకు
పాపిటా పన్నీరు నొసట కస్తూరి,
రాలేద మా బాల మిముగూడియాడ?

చుక్కలలోను చిన్నబాలుడున్నాడు,
ఆబాల గోపాల బాలుడున్నాడు,
పంచదారకుప్ప పాలపైతెప్ప,
మా చిన్ని అబ్బాయి బంగారు కుప్ప.
పొద్దు పొద్దొకచాయ పొద్దొక్కచాయ,
పొద్దున్న అమ్మాయి పొగడపుచాయ.
మాపు మాపొకచాయ మాపొక్కచాయ
మాపున్న అబ్బాయి మల్లెపూచాయ.
జాము జామొకచాయ జామొక్కచాయ
జామున్న అబ్బాయి జాజిపూచాయ.

ఒక్కొక్క ముత్యము వనకూడినట్లు,
ఒప్పేటి కొమాళ్ళ ఏతల్లి కనునో?
రమణుల కన్నదే తాను కౌసల్య
ఊరికి ఉయ్యాల లమ్మచ్చినాయి,

కొమాళ్ళ కనతల్లి కొనవె ఉయ్యాల,
కొమాళ్ళ కన్నతల్లి తాను కౌసల్య,
కోటివేలుపోసి కొనెను ఉయ్యాల.

కోటకుర్చీమీద రాజు కూర్చోని,
కొమ్మనిమ్మపండు తాను తెమ్మనెను.
రత్న కంబళిమీద రాజు కూర్చోని,
పారాడె పంజరపు చిలుక తెమ్మనెను,
కోటకుర్చీమీద రాజు మీతాత,
కొమ్మనిమ్మపండు తాను అబ్బాయి,
రత్న కంబళిమీద రాజు మీ మామ,
పారాడె పంజరపు చిలుక అమ్మాయి.

ఎండాడిపోయినది చిన్న అమ్మాయి?
ఏ స్వామి యిచ్చెనే ఎత్తి ముద్దాడ?
పరమేశ్వరులరాణి పార్వతీదేవి
పార్వతి యిచ్చింది పాప అమ్మాయిని
చీమంత పులిగోరు చుట్రావిరేకు,
చిన్నవాండ్లాడెడు రేపల్లెలోను
మాడంత బంగారు మద్దికాయల్లు,
మహారాజు మా తండ్రి మనుమరాలాయె.

పాపమా అబ్బాయి పాలకేడిస్తే
పాడియావుల నంపిరి మేనమామల్లు,
రాజుల్లబోలి మామల్లు ఉంటే
రచ్చలు ఏలంగ సందేహమేమి?

ఏరంత వెలుపమ్మ యిసుకసన్నమ్మ,
ఏరుదాటి వెళ్లింది ఎవరాడ బడచు?
మూటనున్నది పసుపు పొట్లాన కుంకం.
వడి నిండ పోకల్లు పండుటాకుల్లు,
భమిడి శ్రీ పిల్లమ్మ సారె వెళ్లింది

ఊరికి ఉయ్యాలలమ్మ వచ్చాయి.
కోమాళ్ళు గలవారు కోనరె ఉయ్యాల
కోమాళ్ళు గలవాడు తాను లచ్చన్న
కొంగుమాడలం పోసి కొనెను ఉయ్యాల.

సింహాద్రి అప్పన్న చిరుతిళ్ళవాడు
లంచమిస్తేగాని సంతానమియ్యడు
లంచాలు యియ్యవే నువ్వు అప్పన్న
సంతానమిస్తాడు సర్వేశ్వరుండు.

యిక్కడికి సింహాద్రి ఎంత దూరమ్మ?
అల్లవిగో నేరేళ్ళు తెల్లని గుళ్ళు,
తెల్లని గుళ్ళలో దేవుడప్పన్న
నల్లని గుళ్ళలో ఆదిలక్ష్మమ్మ.

పుట్టిళ్ళు పుట్టిళ్ళు అందరేకాని,
పుట్టిళ్ళ కంటెను పురుషుడేమేలు
కాశీకెళ్దామంటె కదలవే కాళ్ళు
ఢిల్లి వెళ్దామంటె తిరగదేమనసు,
మారాన పుట్టింటికెళ్దాము అంటె
నా కాళ్ళు పసెండు రథములై నడచు
నా చేతులుయ్యాల చేరువై యూగు.

అన్నల్లు వచ్చారు కూరేమిలేదు
అరటి కాకరకాయ అలచందపప్పు
మరదల్లు వచ్చారు కూరేమిలేదు
మంచాన నల్లుల్లు గోడ బల్లుల్లు.

తమ్ముల్లు వచ్చారు కూరేమిలేదు
గుత్తి చిక్కుడుకాయ గుమ్మడికాయ
బావల్లు వచ్చారు కూరేమిలేదు
వెలుగుల్లో తొండల్ని వేటాడి తెండి.

ఆ యమ్మ ఆయి ఓ యమ్మ మంది
ఓ యమ్మ దొడ్డరాజు దండు తిరిగేనమ్మ
దండు దండనగానె తల్లడించారు
దండుకాదు ద్రాక్షారాము భీమన్నమూక.

ఊరికే కుంకమ్మ అమ్మవచ్చింది
కొంగుమాడలుపోసి కొనరె కుంకమ్మ
చేతిమాడలుపోసి చేయింతు భరిణె
గోల్కొండ తీసికెళ్ళి గొలుసు చేయించి
పాలకొండ తీసుకెళ్ళి బందు వేయించి
ఆ భరిణ తీసికెళ్ళి అప్పకీయండి.

చందమామ చందమామ
ఓ చందమామ చందమామ కూతురే నీలగిరికన్య
నీలగిరికన్యకింద నిత్యమల్లెచెట్టు
నిత్యమల్లెచెట్టుక్రింద జీడిమొలచింది.
జీడిగింజ తలుపులు సేతియ్యనేర
నాకంటె చెల్లెలు అతిముద్దరాలు.
అతిముద్దరాల్చేతి పాలవంకిల్లు
పాలవంకిలుమీద భమిడి పువ్వుల్లు
భమిడి పువ్వులమీద పుంజాయిదండ
పుంజాయి దండపై పువ్వుల రవికె
పువ్వుల రవికెమీద పట్టంచుచీర
పట్టంచుచీరగట్టి ఏవాడబోదు?

దాగుడు మూతలు ఆడుదము!
తలపుల మూలల దాగుదము!
పొన్నలు పొగడలు ఎక్కుదము
చిన్ని కృష్ణుని వేడుదము
కురివిందపొదలో దాగుదము
పగడాల శాలల కేగుదము?
అశోక వృక్షము లెక్కుదము
జనని జానకిని వెదుకుదము
బాలిక లందరు కూడుదము
తలపుల మూలల నక్కుదము
దాగుడుమూత దండాకోర్
పిల్లీ వచ్చే ఎలుకపోయే
ఎక్కడి వారలు అక్కడనే.

గోరు చిక్కుడుకాయ గెలవేసినట్లు
గోత్రాన అబ్బాయి నేరికిస్తాము?
ఎవరికిస్తామమ్మ ఎవరికిస్తాము
కులములో మేనత్త కూతురిస్తాము
అత్తమంచిదయితే అనుకూలముయితే
బాలుడు లేతయితే పట్టినిచ్చాము.

పాపమా అబ్బాయి పాలకేడిస్తే
పాడియావుల నంపిరి మేనమామల్లు,
రాజుల్ల బోలి మామల్లు ఉంటే
రచ్చల్లు ఏలంగ సందేహమేమి?

కొండలలో ఉన్నారు మండలేశ్వరులు
కట్టించినాయన కనకమండపము
చేయించె పెదనాయన వెండిగోపురము
పరిపించె చిననాయన నల్లని రాళ్ళు
చూడ బోయి తాతయ్య మన్నుమేయించె
అడుగబోయి అవ్వ అరుగు వేయించె
వెళ్ళిచూచిన యత్త మల్లివనమేసె
పరికించి మామయ్య పావిత్రవ్వించె
అక్కయ్య పోసెను వనములకు నీళ్లు
కోసెను పువ్వుల్లు కోరి మావదినె
వేసెను మాయమ్మ పూలజడనాకు.

చిలకమ్మ మొగుడెంతో శింగారమయ్యే
చెలికత్తెలందరు చెంత కూర్చుండి
శీతాకోకలు చీరలు తెచ్చిరి
కాకులమూకలు బాకాలూద
పందిట పిచికలు సందడి చేయ
కప్పలు బెకబెక డప్పులు కొట్ట
చిలుకమ్మ మగనితో చేరికూర్చుండె.

శ్రీపతి కృష్ణమ్మ రేపల్లెలోను
పాపడై పెరిగెను బహువిధంబుగాను
అంత కంతకు ముద్దు యశోదకును
వింతలుగ జూపెనే వేడ్కనొకనాడు,
ఓ యమ్మ ! ఓ తల్లి ! ఓ గోపిదేవి,
యెన్నో నోములునోచి నినుకంటి కృష్ణ
గోవింద ! గొల్లపల్లెకు బోకుమయ్య
గోపికలు నినువచ్చి కొట్టుదురు కృష్ణా
ఓరుగుండానుంచి ఒకవీధినుంచి
వచ్చెను గొల్లాపె పండ్లగంపతో
వాకిట్లో దింపవే ఓ పళ్ళగంప
మంచి పంచదార పోసేముగాని
పారిపోయి అబ్బాయి పండ్లెత్తుకొచ్చె
తిట్టకవె ! ముసలాపె దీవించవమ్మ
కొట్టకవె ! గొల్లాపె ! కొడుకుల్లతల్లి
మా బిడ్డ దుష్టని ఊరంత తెలుసు,
రుద్రాక్షపండైతె రూకలిచ్చాను
మామిడి పండ్లయితే మాడలిచ్చాను
దీవించు కృష్ణున్ని దీవించుతల్లి.

తిరుపతి వెంకయ్య తిట్టబోకయ్య
వడ్డికాసులతోటి వస్తున్నమయ్యా
బంగారు కోనేటి స్నానాలు చేసి
అయ్య నీ ముడుపులు తెస్తున్నమయ్యా ?
గోపాల కృష్ణమ్మ ఎవ్వారల్లుండు ?
గోవులను కాచేటి గొల్లలల్లుండు
చిన్న మా అబ్బాయి ఎవ్వారల్లుండు ?
మేనత్త రత్నమ్మ మేనల్లుడమ్మ.

అందరి మామల్లు చందమామల్లు
అబ్బాయి మామల్లు మండలాధిపులు
రాజుల్ల యిండ్లలో రత్నాల వెలుగు
మా చిన్న అబ్బాయి మా యిండ్ల వెలుగు.

అందరి చేతుల్లో హంసల్లగిలక
అబ్బాయి చేతిలో రత్నాల గిలక
చిన్న మా అబ్బాయి ఎందాడబోయె ?
బాలలతో గూడి బొంతాడబోయె.

పందిట్లో అబ్బాయి పారాడు చుండ
పనసపండని అత్త పరుగులెత్తేను
దొడ్లోను అబ్బాయి దోగాడుచుండ
దొండపండని అత్తదోసిలొగ్గేను.

హాయి హాయి హాయి ఆపదలు గాయి,
చిన్నవాళ్ళను గాయి శ్రీరంగశాయి.
కొండమీద మామామ యిల్లు కట్టాడు,
కోరి కొడుకులను కంది మా మేనఅత్త
కొడుకులు కొండమీద కోతుల్ని పోలు.
కాకి, కాకి గవ్వలకాకి,
కాకి నట్టుకెళ్ళి గంగలోమునిచి
గంగనాకు గంధంయిచ్చి

గంధం పట్టుకెళ్ళి ఆవుకురాచి
ఆవునాకు పాలుయిచ్చే
పాలు పట్టుకెళ్ళి అమ్మాకిచ్చి
అమ్మనాకు జున్ను యిచ్చె.
జున్ను పట్టుకెళ్ళి పంతులుకిచ్చి
పంతులు నాకు చదువు చెప్పె
చదువు పట్టుకెళ్ళి మామకిచ్చె
మామనాకు పిల్లనిచ్చె
పిల్లపేరు మల్లెమొగ్గ
నాపేరు జమేదార్.
పిల్లి సెంతవరకు తోలేవ్?
గోల్కొండవరకు!
గోల్కొండ ఏమి యిచ్చింది?
గుడ్డిగవ్వ.
గుడ్డి గవ్వ ఏంచేశావు?
నూతిలో వేశాను.
నుయ్యి ఏమిచ్చింది?
నీరు.
నీరేమిచేశావు?
చెట్లకు పోశాను.
చెట్లేమి యిచ్చాయి?
కాయపండె.
కాయపండె ఏంచేశావు?
అవ్వ, తాతకిచ్చాను.
అవ్వ తాత ఏమిచ్చారు?
యీని, పేని.
యీనిపేని ఏంచేశావు?
దూలంపై నొక్కాను.
దూలం ఏమిచ్చింది?
చెక్కపేడు.
చెక్కపేడు ఏంచేశావు?
పొయ్యిలో పెట్టాను.
పొయ్యి ఏమిచ్చింది?
పొయ్యి బుగ్గి.
పొయ్యిబుగ్గి ఏంచేశావు?
పెంటమీద వేశాను.
పెంట ఏమిచ్చింది?
గరిక.
గరిక ఏంచేశావు?
ఆవుకి వేశాను
ఆవు ఏమిచ్చింది?
పాలు.
పాలు ఏంచేశావు?

పాలు పరమాన్నంవండి నేను కొంచెంతిని, నీకు కొంచెం దాచాను, అది పిల్లి తినేసింది. అందుకే గోల్కొండవరకు తగిలేశాను.

# శ్రీకృష్ణ ప్రార్థనలు

శ్రీమతి వంగల వాణీబాయి

శ్రీ కృష్ణా పరమాత్మ దేవ
కరుణాంభోజా జగత్కారణా
హే కంసాంతక హే దయామయ
హరే గోవింద గోపాలకా
నిన్నే నే మది గొల్చియుంటి
గనుమోయీ, గోవర్ధనాధీశ్వరా ॥

భక్తులపాలిటి దైవంబ నీవని
కోరుచున్నదాన కోర్కెయొకటి
నాదు వరమును నీవు త్రోసివేయకుమన్న
మందభాగ్యురాల మహిని నేను
నిన్నెతప్ప వేరు దైవంబు నెరుగను
కావుమన్న గోపాలదేవా ॥

దేవకీతనయ ఓ వసుదేవనందనా
పూతనదండనా, పాండురంగ
గోవర్ధనాధీశ, గోపికామణిలోల
తాండవమర్దనా, నందపుత్ర
యశోదప్రియపుత్ర, మురళీయధరలోల
పతితపావన నిన్నె నమ్మినాను
కావుమోయన్న, పరమాత్మ నాధనాధ
దీనులకు పరమాత్ముడవు నీవెకావె
కాచుకొనిఉన్నాను నీ కరుణకొరకు
శరణు శరణను వారికి అడ్డుకలదే ॥

రావే నందయశోద ప్రీతితనయా
రావే మురారీ భవా,
రావే రుక్మిణివల్లభా, త్రిభువనా
రావే జగత్కారణా,
రావే రాయటయంచు మ్రొక్కెదను
శీఘ్రంబే కటాక్షించుమా ॥

దైత్యుని దండనల్ కఠినమై అరువంగ
ప్రహ్లాదునికి సాటి ఇవ్వలేదా
అత్తమామల పాట్లు పడలేక పిలచిన
సక్కుబాయిని నీవు కావలేదా
మకరంబుచే చిక్కుపడియున్న గజరాజు
ఆర్తనాదము విని పరువెత్తలేదా
కౌరవ అవమానమునకు ఖేదించిన
ద్రౌపది మానము నిలుపలేదా
కృష్ణ కృష్ణా యంచు
నేనును పిలచుచుంటి
కావుమయ్యా అని కేకవైచుచుంటి
వేగముగ వచ్చి నన్నేలుమయ్య దేవా ॥

నుదుట కస్తురి బొట్టు - శిరమున శిఖముడి
మంచిగంధపు పూత వదనముననను
చుట్టు గోపీమణులు పాటలు పాడంగ
వేణుగానము సల్పు గోపబాలు
పరమాత్మ శ్రీ కృష్ణ సరసను రాధయు
ముచ్చటలాడుచు మురియుచున్న
అట్టి గోవిందు గోపాలు
నాత్మవిభుని
తులసిదళములతోడ
నే పూజసేతు ॥

# శ్రీ కృష్ణ ప్రార్థనలు

శ్రీమతి వంగల వాణీబాయి

శ్రీ కృష్ణా పరమాత్మ దేవ
కరుణాంభోజా జగత్కారణా
హే కంసాంతక హే దయామయ
హరీ గోవింద గోపాలకా
నిన్నే నే మది గొల్చియుంటి
గనుమోయీ, గోవర్ధనాధీశ్వరా ॥

భక్తులపాలిటి దైవంబ నీవని
కోరుచున్నదాన కోర్కెయొకటి
నాదు వరమును నీవు త్రోసివేయకుమన్న
మందభాగ్యురాల మహిని నేను
నిన్నుతప్ప వేరు దైవంబు నెరుగను
కావుమన్న గోపాలదేవా ॥

దేవకీతనయ ఓ వసుదేవనందనా
పూతనదండనా, పాండురంగ
గోవర్ధనాధీశ, గోపికామణిలోల
తాండవమర్దనా, నందపుత్ర
యశోదప్రియపుత్ర, మురళీయధరలోల
పతితపావన నిన్నె నమ్మినాను
కావుమోయన్న, పరమాత్మ నాథనాథ
దీనులకు పరమాత్ముడవు నీవె కావె
కాచుకొనిఉన్నాను నీ కరుణకొరకు
శరణు శరణను వారికి అడ్డుకలదే ॥

రావే నందయశోద ప్రీతితనయా
రావే మురారీ భవా,
రావే రుక్మిణివల్లభా, త్రిభువనా
రావే జగత్కారణా,
రావే రాయటయంచు మ్రొక్కెదను
శీఘ్రంబె కటాక్షించుమా ॥

దైత్యుని దండనల్ కఠినమై అరువంగ
ప్రహ్లాదునికి సాటి ఇవ్వలేదా
అత్తమామల పాట్లు పడలేక పిలచిన
సక్కుబాయిని నీవు కావలేదా
మకరంబుచే చిక్కుపడియున్న గజరాజు
ఆర్తనాదము విని పరువెత్తలేదా
కౌరవ అవమానమునకు ఖేదించిన
ద్రౌపది మానము నిలుపలేదా
కృష్ణ కృష్ణా యంచు
నేనును పిలచుచుంటి
కావుమయ్యా అని కేకవైచుచుంటి
వేగముగ వచ్చి నన్నేలుమయ్య దేవా ॥

నుదుట కస్తురి బొట్టు - శిరమున శిఖముడి
మంచిగంధపు పూత వదనముననను
చుట్టు గోపీమణులు పాటలు పాడంగ
వేణుగానము సల్పు గోపబాలు
పరమాత్మ శ్రీ కృష్ణ సరసను రాధయు
ముచ్చటలాడుచు మురియుచున్న
అట్టి గోవిందు గోపాలు
నాత్మవిభుని
తులసిదళములతోడ
నే పూజసేతు ॥

# భామినీ జనబాంధవుడు

శ్రీ పాలపర్తి నరసింహాం

సర్వ విషయములలోను దేశాభ్యుదయమునకై విశేష దూరదృష్టితోను, సమర్థతతోను, ధైర్యసాహసములతోను కృషిని ప్రారంభించి, జయప్రదముగా నద్దానిసాగించి, దేశభక్తులకెల్ల మార్గదర్శకుడై శ్రీ. రామమోహనరాయలు భారతీయుల చిరకృతజ్ఞతకు పాత్రుడయినాడు. "నవభారతపిత" "The Father of Modern India" యని మాన్యుడైన న్యాయమూర్తి మహాదేవ గోవిందరనెడే అతనిని సన్నుతించుట యెంతయు సమంజసముగదా! రాయలవారి ఘనకార్యములలోనెల్ల స్త్రీ జనోద్ధరణమునకై అతడు కావించిన అపూర్వమైనసేవ సమస్త భారతీయులకు, అందు ముఖ్యముగా స్త్రీలకు నెన్నటికిని మఱవరానిదై పరగుచున్నది.

ప్రాచీన కాలమున సామాన్య విద్యలనేగాక సర్వోత్కృష్టమైన బ్రహ్మవిద్యనుగూడ నెలతలు నేర్చినట్లు నిదర్శనములు పెక్కులుగలవు. వివాహ విషయములో వారి కెంతటి స్వాతంత్ర్యముగలదో నాడు వెలసియున్న స్వయంవర వివాహములే చాటుచున్నవి. ఇతర వ్యవహారములలోగూడ ఎట్టి నిర్బంధములు లేకుండ వనితలు పనులను నిర్వహించుకొన్నట్లు దేశచరిత్ర వెల్లడించుచున్నది. వెనుకటిమాట యేమైననేమి రామమోహనుని కాలమున మాత్రము హిందూ భామినులస్థితి అత్యంత శోచనీయమైయుండెను. నాడు మగువలు విద్యను గడించుటకు అనర్హులుగా నెంచబడిరి. వివాహ విషయములో తల్లిదండ్రులు చెప్పిన చొప్పున నడచుకొనవలసినదేగాని మారు మాటాడుటకు వారికి వీలులేదయ్యెను. కన్నెత్తి వారు వీధిమొగమునుగూడ చూడరాదు. ప్రతి స్త్రీకిని ఎనిమిది సంవత్సరములకు లోపుననే వివాహము కావలయును. అట్లు కానిచో తల్లి దండ్రులు శాస్త్రమును ఉల్లంఘించిన వారగుదురు. రజస్వలానంతర వివాహము మహాదోషము. స్త్రీ ఒక భోగ్యవస్తువు. పురుషు డెందరు మగువలనైనను వివాహమాడవచ్చును. పురుషుని ఆగ్రహమునకు గుఱియైన స్త్రీయొక్క దురవస్థ వర్ణనాతీతమయినది. వివాహమాడుటయేగాని భార్యను చూడవలసిన బాధ్యత పురుషునిమీద లేదు. పెండ్లాడిన పిల్లను భర్త తన యింటికి తీసికొని పోకపోయినను తల్లిదండ్రులు ఆమెను తమ గృహమునందుంచుకొని ఆమెచే చేతనైన చాకిరి చేయించుకొని నాల్గు మెతుకులు బెట్టి ఆమెను సంరక్షించుటతప్ప గత్యంతరము లేదయ్యెను. బహుశా తమకు కన్యాదాన ఫలము దక్కినదని వారు లోలోన సంతుష్టిపడిన పడవచ్చును. ఒక ప్రక్క బహు భార్యా స్వీకారపు బాధ యిట్టులుండ చనిపోయిన భర్తతోబాటు భార్యను చితిలోబెట్టి దహించెడు ఘోరమైన దురాచారమొకటి వెలసియుండెను. ఒక్కొక్క మృత భర్తతోబాటు ఇద్దరు ముగ్గురు స్త్రీలుగూడ చితినెక్కవలసియుండిరి. అప్పటి వనితల దుస్థితి ఊహించుకొనవలసినదేగాని వర్ణింపనలవయినదిగాదు.

బుద్ధిమంతుడగు రామమోహనుడు నాటి భామినుల స్థితినంతయు పూర్తిగా నవగాహనము చేసికొనెను. విశేషించి సతీదహన దురాచారమునకై అతని హృదయము దహించుకొనిపోవుచుండెను. అతని బుద్ధి యెంత తీక్ష్ణమైనదో హృదయమంత కోమలమయినది. ఇందుకేదైన ప్రతీకారముచేయ అతడు ఆలోచించుచుండెను. ఇట్టి తరుణమున అతని జ్యేష్ఠ సోదరుడు జగన్మోహన్ మరణించుట తటస్థించెను. దేశాచార ప్రకారము అతని వదినెగారు సహగమనమునకు సిద్ధపడెను. ఆ సంకల్పమునుండి ఆమెను తప్పించుటకై రామమోహనుడు శత విధముల ప్రయత్నించి చూచెను. కాని అతని యుక్తులకన్న విన్నపములకన్న ఆచారమే బలిష్టమయ్యెను. వదినెగారు సహగమనము చేసిన తరువాత ఆ దురాచారమును తుదముట్టించి తీరవలయునన్న సంకల్పము అతనిలో పూర్తిగా దృఢపడెను. రాయలవారి అభిప్రాయ

మన కనుగుణముగా ప్రభుత్వముయొక్క ధోరణిగూడ సహగమన దురాచార నిర్మూలనమునకు సుముఖముగా నుండెను. సహగమనము మతవిషయమనియు, ఇందులో ప్రభుత్వమువారు జోక్యము కలిగించుకో రాదనియు హిందువులు గగ్గోలు పెట్టుచుండుటచే వారు దానిని నిషేధించుటకు వెనుకాడుచుండిరి. ఇట్టి సమయమున రామమోహనునివంటి ప్రతిభాశాలి యొక్క తోడ్పాటు వారి కెంతయు ధైర్యము నిచ్చెను. రాజ ప్రతినిధి లార్డ్ విలియంబెంటిక్కు సహగమనమును నిషేధించుచు శాసనము గావించెను. తరువాతగూడ నూరకొనక పూర్వాచార పరాయణులగు హిందువులు సహగమన నిషేధ శాసనమును రద్దుచేయ వలయునని ఇంగ్లాండు ప్రభుత్వమునకు విజ్ఞప్తి చేసికొనిరి. అపుడు శ్రీ రామమోహనుడు సముద్రయానము నిషేధింపబడిన ఆ దినములలో ఇంగ్లాండునకు బోయి శాసన సభ్యుల హృదయములు కరగునట్లు సహగమనమునుగూర్చి సాక్ష్యమునిచ్చి, ఆ దురాచారమును నిర్మూలింపజేసెను. ఇది హిందూ భామినులు మరవరాని మహోపకారముగాదా?

స్త్రీలకు విద్యను చెప్పింపవలసిన ఆవశ్యకతగూర్చి గూడ అతడు ఎంతయు ప్రబోధము గావించెను. బహుభార్యాత్వమును రూపుమాపుటకు అతడు తీవ్రముగా కృషిచేసెను. ఆస్తివిషయములో స్త్రీలకుగల హక్కులనుగూర్చి సయితము అతడు మిక్కిలి ఆందోళన ముగావించెను. సహగమన నిషేధముతో ప్రారంభమైన సంఘ సంస్కారము తరువాత కాలమున అనేక విధముల దేశములో విజృంభించినది. సహగమన నిషేధ శాసనానంతరము వితంతూద్వాహశాసనము పుట్టినది. ప్రభుత్వదృష్టినాకర్షించుటకై సంఘ సంస్కర్తలు తీవ్రముగా కృషిచేయవలసిన దినములు గడచిపోయినవి. నేడు ప్రభుత్వమే స్త్రీలవృద్ధి, వికాసములకై కావలసిన కార్యములనెల్ల జేయసమకట్టినది.

1950 సం॥ జనవరి 26వ తేదీన భారతదేశము స్వతంత్ర ప్రజాస్వామిక ప్రభుత్వముగా పరిణమించినది. నాటినుండి స్త్రీల చరిత్రలోగూడ నూతనమైన ఒక ఉజ్జ్వల ప్రకరణము ప్రారంభమైనదని నుడువవచ్చును. భారత రాజ్యాంగ చట్టము పురుషులతో సమానమైన ప్రతిపత్తిని మగువలకు ప్రసాదించుచున్నది. ఇక మీదట ఏ ప్రాచీన శాస్త్రమునో పేర్కొని స్త్రీలకు చెందవలసిన హక్కులను ఎగ బెట్టుటకు వీలులేదు. జాతిమత వివక్షలతో పనిలేకుండ స్త్రీ పురుషులకు వివాహమాడు స్వాతంత్ర్యమును ప్రసాదించు ప్రత్యేక వివాహశాసనము శాసన సభాంగీకారమును పొందినది. హిందు వివాహములకు, విడాకులకు సంబంధించిన చట్టమిపుడు శాసన సభాలోచనలోనున్నది.' ఆస్తి విషయములో గూడ స్త్రీలకు సముచితములయిన హక్కులు ప్రసాదింపబడినవి. ఉద్యోగముల సంబంధమునగూడ యోగ్యతా సామర్థ్యములున్న వనిత యెట్టి ఉన్నత పదవినైన నిరభ్యంతరముగా అలంకరింపవచ్చును. ఇప్పటికే విదుషీమణుల నేకులు ఉన్నతోద్యోగము లందుండి దేశమును సేవించుచున్నారు. నేడు మహిళాలోకమున కనుపట్టుచున్న వికాసమున కంతటికిని భామినీ జనబాంధవుడగు శ్రీ రామమోహనుడు నాడు ఉపక్రమించిన కృషియే కారణమని కృతజ్ఞతా పూర్వకముగా స్మరించుట సముచితముగదా!



# బాపూజీ భావాలు

ఏజాతియు యింతవరకు త్యాగము చేయనిదే ఉద్ధరించబడలేదు. ఆ త్యాగము అమాయకత్వాన్ని ఆధారముగా కలిగి యుండాలికాని క్రౌర్యమును మాత్రము కాదు.

♦ ♦ ♦

క్రమశిక్షణకు బద్ధంగాలేని ప్రజాయుద్యమం హింసాయుతమయిననాడు అది నిర్మాణాత్మకం కంటె విధ్వంసకరంగా పరిణమించగలదు.

♦ ♦ ♦

సానుభూతి, సద్భావము, ఆసక్తి అండగా నున్న ప్రజల మహజర్లకు ఎక్కువ విలువ యుంటుంది.

♦ ♦ ♦

ఒక అవాంతరాన్ని ఎదుర్కొనడానికి పిరికితనము, హింసాకాండ రెండేమార్గాలయినప్పుడు నేను హింసాకాండనే మంచిదిగా సూచిస్తాను.

♦ ♦ ♦

వ్యవసాయము, చేతితో నూలువడుకుట దేశానికి రెండు ఊపిరితిత్తుల్లాంటివి. వానిని క్షయరోగంనుండి రక్షించుటకు అన్ని విధాల కృషి చెయ్యాలి.

♦ ♦ ♦

నీతి నియమాలకు లోబడినదిగా లేనిచో ప్రేమ విషతుల్యంగానగును.

ప్రతిఫలమును ఆశించకుండా ఆరాధన చేసేవాడే నిజమైన దైవభక్తుడు. తనస్నేహితులపట్ల నిజాయితిగాను, విరోధులపట్ల ద్రోహచింతతోటి వ్యవహరించేవాడు పిరికిపందగా గణ్యతకు వస్తాడు.

♦ ♦ ♦

న్యాయాన్ని, ధర్మాన్ని అనుసరించే ప్రతిజాతికి స్వాతంత్ర్యశాంతి సౌఖ్యాలతో కూడిన ఆశీస్సులకు కొరతయుండదు.

♦ ♦ ♦

ఏజాతికాని, వ్యక్తికాని నీతి నియమాలను తృణీకరించలేదు. అన్యాయము, అక్రమము కొంతకాలము విజయవంతము కావచ్చును; కాని దానిని రేపో మాపో ప్రమాదకరమైన పతనావస్థ కనిపెట్టుకొనే యుంటుంది.

♦ ♦ ♦

సత్యాగ్రహులముగా మనము బాధపడుతూ ప్రేమతో విరోధులను గెలువకలుగాలి.

♦ ♦ ♦

సత్యాగ్రహంలో ప్రధానలక్ష్యమేమిటంటే యితరులను కష్టపెట్టరాదు; న్యాయాన్ని సాధించడానికి కష్టాలను మనం భరించాలి.

♦ ♦ ♦

నిరోధించడమనేది ప్రభుత్వసహాయము, సానుభూతి లేనప్పుడు జరుగవలసినది.

'శిశి'

# నిర్వేదం

శ్రీ 'విజయ - రాఘవ'

"రాధా !"

"ఆ ... "

"ఏంచేస్తున్నావ్ దొడ్లో"

"పొట్టుపొయ్యి కూరుస్తున్నానే"

"అబ్బ ! తర్వాత కూరుకోవచ్చులే. ఒక గంటాగితే పనిమనిషి వస్తుందిగా ! నువ్వోకసారి యిలారా!

"వస్తున్నా ! చేతులు కడుక్కోని."

"దేనికీ పిలిచావ్."

"కూర్చో అట్లా ! పొద్దున మీ నాన్నగారు, బామ్మ తెచ్చిన సంబంధం యెట్లావుంది ?"

"ఎట్లావుందేమిటీ, నువ్వుకూడా అలా అడుగుతావ్."

"తప్పేముందే, నచ్చిందా !" అని అడుగుతున్నాను.

"నీ కెలావుందో ముందుచెప్పు ?"

"చేసుకునే దానివి నువ్వా, నేనా ? నీ యిష్ట ప్రకారం చెయ్యమంటే చేసేవాళ్లమేగాని, పట్టి బలవంతాన పీటలమీద కూర్చోబెట్టి అక్షింత లేశేవాళ్లం గాదుగదా !"

"నాకు సిగ్గేస్తోందే చెప్పడానికి."

"కన్నతల్లి దగ్గరకూడా సిగ్గేమిటీ చెప్పడానికి."

"అబ్బ ! ఏమోగానోవుందే !"

"పోనీ ! నచ్చలేదా ! చెప్పు ... మరి."

"నేనసలు ఆయన వంకైన చూడందే"

"నా బొందలాగుంది. చూడకపోవడమేమిటీ ... అంత సిగ్గైతే ఎట్లాగే."

"మరి, మీ నాన్న లోపలకువచ్చి బీరువాచాటు నుండి నచ్చిందా సంబంధం అంటే ఊఁ ... "అన్నావుగా.

"ఏమన్నానో యేమిటో అగమ్యగోచరంగా వుంది."

"మంచిపనే, సరేలే అయినప్పటికే అవుతుంది దేనికైనా కలిసిరావాలిగా." అంటూ కాంతమ్మ గారు కందిపప్పు చెరగాలని లేచిపోయింది.

'రాధ' స్కూలు ఫైనలువరకు చదువుకొంది. తండ్రి జగన్నాథం, తల్లిచెప్పే గొంతెమ్మ కోరికలకు అనుగుణ్యమైన వరుడు కావాలని కాళ్లు బలపాలు కట్టేంతవరకు తిరిగి, తిరిగి "కాశీకిపోయి యేదో తెచ్చినట్లు ... " ఒక సంబంధం తెచ్చాడు.

"నా తమ్ముడున్నాడు. వాడివైపు పొలంకూడా వుంది. పెద్దగా చదువుకోపోయినా, వాడిపొట్ట వాడు పోషించుకో గలిగినంతగా చదువుకున్నాడు. గౌరవ మర్యాదలు తెలుసుకున్నవాడు. అయిన సంబంధంకూడా. ఎప్పటికైనా చేతికందుబాటులో వుండేవాడు. వాడికి 'రాధ' నిద్దామని" భార్య కాంతమ్మ ఎన్నిసార్లో చెవిదగ్గరకువచ్చి చెప్పుకున్నా, లెక్కచేయక, దూరపు కొండలు నునుపన్నట్లు జగన్నాథం యీ సంబంధం' కూడబెట్టుకొచ్చాడు. బి. ఏ. ఆనర్సు సంపాదించిన జగన్నాథం, కాంతమ్మ మాటల్లో నగ్నసత్యం అర్థంచేసుకోలేకపోయాడు. తాంబూలాలుకూడాయిచ్చి పుచ్చేసుకున్నారు, తల్లి మాటకి "ఊఁ" కొట్టి, తలుపుచాటునుండి యేం జరుగుతుందో అని కాంతమ్మ, రాధ చూద్దామనుకున్నారు. కాని, "ఛీ! యెందుకంత దొంగచాటు నేరం అనిపించి" దొడ్లోకిపోయారు.

విషయం అంతా తెలుసుకొని కాంతమ్మ చాలా బాధపడింది. అయిన సంబంధంవల్ల కలిగే లాభానికీ, పరాయి సంబంధంవల్ల కలిగే లాభానికి తేడాయెంతో కాంతమ్మకు కొంతవరకు తెలిసిన విషయమే. కాని ఏంచేయడం - భర్త, అత్తగారు ఒకవైపు, కూడబలుక్కొని సంచరిస్తుంటే! కాకపోతే "చేసుకున్న భార్యతోకూడా సంప్రదించకుండా యీ విధంగా సంబంధం అంగీకరించారే" అని గుడ్లనీళ్లు గుడ్లకుక్కుకొని యేడ్వటమేగా చేయగలిగింది! కన్నకూతురు విషయంలో, కల్పించుకొని, మాట్లాడడానికికూడా

స్వతంత్రం లేనప్పుడు తాను యింకేవిషయంలో జోక్యం కల్పించుకుంటే సానుకూలమై తీరుతుంది? తను కాపురానికొచ్చింది మొదలుగా యేనాడు "యీరోజు హాయిగా వున్నానని, గుండెమీద చెయ్యేసుకొని చెప్పకోగల్గింది? అత్తగారినడిగి చీర కట్టుకొని, పూలుకొనడానికి, పెట్టుకుంటానికి అనుజ్ఞ తీసుకొని బ్రతికే తన బ్రతుకు యే తెగలో చేరుతుంది? తన వైపునుంచి, తన్ను చూడడానికి ఎవరైనా బంధువులొస్తే ఒక్కపూట భోజనానికి వుండమని కోరడానికి హక్కులేదుగదా! కన్నతండ్రి వస్తే కడుపార అన్నంబెట్టి, మంచీ-చెడూ మాట్లాడడానికి ప్రాప్తిలేదుగదా! తోబుట్టువు 'గారి' వస్తే పసుపు, కుంకుమతో ఆదరించడానికి నోచుకోని తన జీవితం యింకెలా సుఖవంతమయ్యేది." కాంతమ్మ తన దౌర్భాగ్యపు బ్రతుకును గురించీవిధంగా తల్చుకొని రాత్రింబగళ్లు లేవు.

♦ ♦ ♦

జగన్నాధం, తల్లి జానికమ్మ ఒకనాడు మధ్యాహ్నం పెళ్ళికి తెచ్చిన సరుకులన్నీ యెంచుకుంటూ, పందిరి పట్టెమంచంక్రింద సద్దుతోంది. కాంతమ్మ దొడ్డివసారాలో కూర్చొని చిరిగిపోయిన మావిడిచిగురు-చీర పమిటిచెంగు కుట్టుకొంటోంది. రాధ వాకిటి వసారాలో పడకకుర్చీలో పడుకొని యేదో పుస్తకం చదువుకొంటోంది. జగన్నాధం ఒక పదిహేను రోజులపాటు ఆఫీసుకు సెలవుపెట్టి శుభలేఖలు అచ్చువేయించే నిమిత్తంగా వెళ్ళిపోయాడు.

"జానికమ్మా! యేంజేస్తున్నావ్" యెదురింటి వెంకాయమ్మ కాలిమీద చెంగు పైకిలాగి బొడ్డులో దోపుతూ, మెట్లు ఎక్కుతూ కేకవేసింది.

సద్దే, సద్దే సరుకులన్ని ఆ పాటినే వుంచేసి, చేతులు దులుపుతూ, గదితలుపు గొళ్లెంబెట్టి, కళ్ళజోడు సర్దుకుంటూ——

"వస్తున్నానమ్మా! మాయపని ఎంతజేసినా తరిగి చావదుగదా!"

"పిల్లలుండేయిల్లాయ మరి, ఊడ్చేవాళ్లం ఊడుస్తూనేవుంటాం; పడేపాచి పడుతూనే వుంటుంది. దానికి వేళా - పాళా యేమన్నా వుంటేగా!"

"ఆ ... ఏమిటోగాని, అంతా మనకే పట్టినట్లు. ప్రతిదీ మనమే చేసుకు చావాలాయె. ఎంతనిచేస్తాం మనం మాత్రం."

"సరేగాని, రెండురోజులయింది పురాణం చదివి. కాస్త మళ్ళా మొదలెడుదూ!"

"పని చచ్చినంతుంది. తీరికలేకుండావున్నాను. నీకు చదవడంవచ్చుగా. చదువుదూ; నేను ఊకొడుతుంటాను."

"నువ్వు చదివినట్లు నేచదువగలనా! కళ్లుకనబడి చావవుగా అయినా."

"పోన్లెద్దూ రెండురోజులాగరాదూ! తర్వాత చదువుకుందాం."

"అయితే ఎందుకూ! వెళ్ళొస్తా. ఆ పెసలన్నా బాగుచేస్తా-కాసేపు కూర్చొని."

"మంచిది వెళ్ళిరా, నిన్ను పిలవకుండా పురాణం మొదలెట్టనుగదా!"

"ఆదేమిటమ్మా! అలా అంటావు." అంటూ వెంకాయమ్మ చక్కా వెళ్ళిపోయింది.

మళ్ళావచ్చి జానికమ్మ సరుకులు సద్దుకుంటోంది. చదువుకొంటున్న 'రాధ' గభాలున కుర్చీలోంచిలేచి లోపలకొచ్చి——

"బామ్మా! నాగేశ్వరావ్ తాతయ్య వస్తున్నాడే."

"కాస్త కాళ్ళు కడుక్కుంటానికి నీళ్ళివ్వు, తెచ్చొస్తున్నా" అంది జానికమ్మ.

రాధ అందిచ్చిన యిత్తడిచెంబు నీళ్ళతో నాగేశ్వరావు కాళ్లు చేతులూ కడుక్కొని కుర్చీలో కూర్చొన్నాడు.

"ఎక్కణ్ణుంచిరా, రావడం?"

"బందరు నుంచేనే."

"పిల్లలూ - అనసూయ అంతా కులాసా ?"

"ఆ ... అంతా కులాసే."

"ఇంకేమిటిరా కబుర్లు ?"

"ఆ ... ఏముంటాయ్ చెప్పదగ్గవి. నువ్వే చెప్పాలిగాని."

"చెప్పడాని కేముందిరా ! బహుశా ! నీకే తెలిసే వుందనుకుంటూ !"

"ఏమిటది ?"

"ఏమిటేమిటిరా ! 'రాధ' పెళ్లి విషయం?"

"ఎప్పుడు ? - ఏమిటి ? - ఎక్కడ ? నాకేం తెలుసు యీ సంగతి? బలేదానివే" అంటూ ఆశ్చర్యంగా పడుకున్నవాడల్లా కూర్చొని, ఒక్క బీడీ అంటించాడు నాగేశ్వరావు.

కాంతమ్మ, రాధ లోపలి వరండాలో కూర్చొని వున్నారు.

"ముహూర్తం యెప్పుడే అక్కయ్యా!"

"వచ్చేనెల రెండో వారంలో రెండు లగ్నాలు మంచివున్నయ్యని మన హయగ్రీవాచార్యులుగారు చెప్పారు. యింకా యేదో ఖచ్చితంగా తేల్చలేదు."

"చాలా దగ్గర్లో వుందన్నమాట! అన్నట్లు పిల్లవాడు యేంచదువుతున్నాడు ?"

"అదేది ... B.Sc. & B.Com; యేదో ... యేదో ఆ చదువు చదివాట్ట. మీ బందరులోనేట చదివిందికూడా."

"అట్లాగా ! కట్నం యేమాత్రం ?"

"రెండువేల మూడొందలు అని అనుకున్నాం."

"పిల్లవాడికి తల్లిదండ్రీ, పొలం పుట్రావుందా!"

"తండ్రిలేడట. పొలంకూడా లేనట్లే తోచింది."

"పేరేమిటన్నావ్ ?"

"మధుసూదనరావు-ట."

కూర్చొన్న కాంతమ్మ, జానికమ్మ మాటలువిని నేలమీద చెంగుపరుచుకొని పడుకొంది. రాధ పుస్తకం మూసి బీరువాలో వుంచింది. తల్లితలదగ్గర తనూ పడుకొంది.

వాకిట్లో నాగేశ్వరావు, జానికమ్మ యింకా యేదో మాటలు గుసగుసలాడి, యెవరిదారినవాళ్లు విడిపోయారు.

'యీ మాత్రం వివరాలు నాకుగాని, నా కూతురికిగాని యింతవరకు తెలియకుండా, యీ విధంగా బయటవాళ్లకు చెప్పతుంటే, వినేరాత నాకు పట్టాల్సి వుంది కాబోలని' బిగపట్టుకొని ఉన్న దుఃఖాన్ని ఒక్కసారిగా కక్కేసింది కాంతమ్మ.

"అమ్మా ! దేనికే యేడుస్తావ్"

"ఎమీలేదమ్మా !"

"నాకు తెలుసు. చెట్టు పుడిగేకాలానికి కుక్కమూతి పిందెలన్నట్లు యేదో అపచారం జరక్క తప్పదు" - అని యింటిపై కప్పుచూస్తూ రాధ నిస్పృహాగా అంది.

'రాధ'కి తల్లి దగ్గిరున్నంత చనువు తండ్రి దగ్గరగాని, బామ్మదగ్గిరగాని లేదు. మనస్ఫూర్తిగా తనకా సంబంధం యిష్టంలేదు. అమ్మమాట వింటానికి యీ యింట్లో ఆస్కారం తనకుతప్ప యింకెవ్వరికీ లేదని తెలుసు. తన్ను గురించి 'అమ్మ' యెంతో బాధ పడుతోందని తెలుసు. 'నా మనస్సులోని విషయం విప్పిచెప్పుకుంటే వినేవాడు యెవరున్నారని' కంట నీరొట్టుకుంది. 'యిష్టంలేని పెళ్లిళ్లుజరిగి యెన్ని కుటుంబాలు చేడిపోయాయో, యెంతమంది నూతికి, గోతికి ఉరికారో, తనకు తెలియని విషయంకాదు. తనకు వ్యక్తిత్వం యేర్పడింది. తన జీవితంమీద తనకు హక్కుంది. అనుకూలమైన వరుణ్ణి కోరుకుంటానికి అర్హతవుంది. ఏంలాభం !' అని ఒక్క నిట్టూర్పు విడ్చి పెద్దలు నిశ్చయించిన లగ్నానికి మధుసూదనరావుచేత మంగళసూత్రం కట్టించుకోక తప్పిందిగాదు. కాంతమ్మ పమిటచెంగు నోట్లో కుక్కుకొని యేడ్వటం కూడా రాధ చూసింది. ఏంచేస్తుంది ? పీటలమీది నుంచి లేచొచ్చిన తరువాత కాంతమ్మను కావిలించుకొని వెక్కి వెక్కి యేడ్చింది.

"ఎన్ని ఆశలు పెట్టుకున్నానో అన్ని గాలిలో మేడలయినయి. చదువుకున్న విజ్ఞానమంతా బూడిదలో పోసిన పన్నీరయింది. 'అమ్మ చేత సంతోషంగా అక్షింతలు వేయించుకోలేకపోయాను' అని కాంతమ్మ ఒళ్లో పడుకొని ఆ రాత్రి యెంతగా యేడ్చిందో తను, యీనాడు కాపరాని కెళ్ళబోయేముందు బండెక్కుతూంటే, అవన్నీ జ్ఞాపకాని కొచ్చాయి.

కాపరాని కెళ్లినరాధ వుత్తరాలు వ్రాస్తుండక తప్పేదికాదు. ప్రతి వుత్తరంలోను నాన్న, బామ్మ కూడ బలుక్కొని చేసిన పనులన్నీ, అమ్మ అంగీకారంగాని, తన యిష్టతగాని లేకుండా చేసిన విషయాలన్నీ ఏకరువు పెట్టుతూ వ్రాస్తూండేది. కాని వాటిని కళ్లారచూచి చదువుకొని కంటతడిబెట్టేది ఒక్క కాంతమ్మే. "పిచ్చిపిల్ల! దానికేం తెలుసురా - బెంగకదూమరి!" అంటూ వుత్తరం చూచినప్పుడల్లా జానికమ్మ అంటుంటే జగన్నాధం వూరుకుండేవాడు. పశ్చాత్తాపంపడాలి అని అనుకునే కారణం తన కెక్కడా తగలడంలేదు.

సంవత్సరం దొర్లింది. మధుసూదనరావు కాపరం రాజమండ్రిలో పెట్టాడు; ఉద్యోగ నిమిత్తం మధుసూదనరావు ఆఫీసుకుపోతే, రాధ ఒక్కతే యింట్లో వుండాలి. కొత్తవూరు, యింకా యెవ్వరూ యిరుగు-పొరుగువారు పరిచయంకాలేదు. పనిచేసే పది హేనేళ్ల తూర్పారి కాపులమ్మాయి లక్ష్మితప్ప తనకు తెలిసినవారు లేకుండాపోయారు. తను ఒంటరిగా వుండటంవల్ల ఏంతోచడంలేదని, లక్ష్మిని పనివున్నా, లేకపోయినా సాయంగా, తోడుగా వుంచుకొంటూ వుండేది. "రాధ" - "లక్ష్మి" చాలా అన్యోన్యంగా వుంటూండేవారు. మధుసూదనరావు యింటికొచ్చినప్పుడల్లా అదోలాగుండటం రాధ చాలాసార్లు పరకాయించి చూడసాగింది. కాని దాచుకొన్న విషయం విప్పిచెప్పడానికి వినుగుపడుతుండేవాడు.

ఒకనాడు రాధ కదిలించింది. యిద్దరూ భోజనాలుచేసి మంచాలమీద కూర్చున్నారు. లక్ష్మి వసారాలో కూర్చునుంది.

"ఏమండీ! అలా వుంటున్నారేమిటి?"

"ఏం! యెలావుంటున్నా!" బాగానే వున్నాగా."

"ఎందుకండీ దాస్తారు - నా దగ్గరకూడా."

"దాచేదేముందే! ఎంతదాచినా విప్పిచెప్పక తప్పదుగదా యేనాటికైనా."

"అదిసరేననుకోండి! నేనడుగుతున్నాగా! చెప్పండిపోనీ!"

"సిగరెట్టు కాల్చనీ సొంతం!"

"అబ్బ! వెధవసిగరెట్లు వూరికే తగలెయ్యకపోతే తోచేటట్లులేదే."

"నిజమే! సంపాదించిన దాంట్లో మూడోవంతు దీనికి ముడుపుచెల్లించక తప్పడం లేదు."

"అందుకే మానమని కోరుతున్నా."

"సరేగాని, రాధా! మొన్న మీ అమ్మావాళ్లకు వుత్తరం వ్రాసావుగదా! పురిటికి నిన్ను తీసికెల్తామని ఏమైనా జవాబొచ్చిందా!"

"ఆ వుత్తరం తరువాత, మరొకవుత్తరంకూడా వ్రాసాను. దేనికీ జవాబు రాలేదు. ప్రతిరోజూ పోస్టుచూడలేక కళ్లు కాయలుకాస్తున్నాయి."

"నాకేం నమ్మకంలేదు రాధా! జవాబొస్తుందని"

"మీకెలా తెలుసండీ"

"తెలిసేదేముంది! కన్నకూతురిని కడుపుతోవుంటే ప్రథమ కాన్పుకదా! ముచ్చటగా తీసికెళ్లి పురుడు పోద్దామనే కుతూహలం వాళ్లకుండాలి గదా! అటువంటిదేమీ లేకుండా మూగనోము పట్టికూర్చుంటే, దాని వుద్దేశ్యం ఆమాత్రం గ్రహించలేమా!"

"పోనీ, ఒక్క విషయం మిమ్మల్నడగాలనివుంది. మీరిష్టపడితే... అడుగుతాను."

"నాకూ వినాలనుంది, చెప్పు"

"నన్ను తీసికెళ్లడానికి వస్తే సరేసరి వెడతాను. లేదంటే లక్ష్మిని వెంటబెట్టుకొని, నేనేపోయి పురుడు పోసుకొస్తా! ఏమంటారు?"

"ఏమనేదేముంది. నీఅంతట నీవెళ్లడం నాకేం నచ్చడంలేదు. కన్నవారికే లేనప్పుడు, ఆఖరుకు నే పురుడు గవర్నమెంటు ఆస్పత్రిలోనే పోసుకోవచ్చు."

"ఎవ్వరూ తోడులేకపోతే యేంబాగుంటుందండీ"

"తోడు_నీడ యేమిటి - మనపెళ్ళయి సంవత్సరం దాటిపోతోందిగా! ఒక్కసారైనా మీ అమ్మగాని, నాన్నగాని, చివరికి బామ్మగాని వచ్చేళ్లేరా! వెధవ వుత్తరం ముక్కలు మాత్రం నెలకు నువ్వో - నేనుకలిసి పాతిక్కి తక్కువరాయంగదా"

"నాయందు 'నా' వారికి మమకారంలేకపోవడం ఏనాడో నేచేసుకున్న 'కర్మ' అని వూరుకొంటూను."

"వూరుకోక చేసేదేమిటిలే! భగవంతునిదయవల్ల మన కాపురం సలక్షణంగా సాగుతోంది. మనమంటే ప్రేమవున్నవాళ్లే వచ్చి చూసెడతారు. రానివారి కోసం దిగులు పడవలసిన గతి మనకేం పట్టలేదు."

"అన్నట్టు అసలు విషయం మరిచానండోయి"

"ఏమిటీ"

"ఏమిటేమిటి? యిందాక మీరు సిగరెట్ కాల్చుకొని చెపుతానన్నది."

"అదా! చెపితే ఒకవేళ నువ్వు మరింత బాధ పడతావేమోనని శంకిస్తున్నా"

"ఫరవాలేదు. చెప్పండి."

"పెళ్ళినాడు నాకిస్తానన్న లాంఛనం యింతవరకూ సమర్పించకపోతే, ఏమనుకోవాలి"

"ఇప్పుడు దాన్ని గురించి మీ రూరికే మధన పడటం"

"ఇందులో మధనేముంది. ఆయన నోటితో ఆయనే ఇస్తానన్నాడు, అందుకనే నేను పెద్దగా అడగటం కూడా లేదు."

"అటువంటివేం మనస్సులో పెట్టుకోబోకండి. యిస్తే అందుకోండి. లేకపోతే, భగవంతుడుచల్లగా చూస్తే మనమే చేయించుకోవచ్చు"

"అందుకే వూరుకున్నా గా"

"టైమెంతయింది"

"ఎంతగాకేం! పదిగంటలు దాటుతోంది"

"పడుకుందామా!"

"నేను కాసేపు పనిచేసుకొని పడుకుంటా, నీకు నిద్దరవస్తే నువ్వుపడుకో" —

"లక్ష్మికూడా పడుకుందనుకుంటా!"

"నిద్రవస్తే పడుకోదూ!"

రాధకు తొమ్మిదోనెల ప్రవేశించిందని తల్లి దండ్రులకు వుత్తరం వ్రాసినా, యేజవాబు రాకపోయే సరికి, పూర్తిగా వారివల్ల తనకే సహాయంలేదని ధృడ నిశ్చయురాలై వుండిపోయింది. ఇటువంటి పరిస్థితుల్లో మధుసూధనరావు బెంగుళూరు క్యాంపు వెళ్లాల్సొచ్చింది. అతనికీ నిజంగా తొందర పనులెక్కువయి నయి. ఏవేళప్పుడు ప్రసవిస్తుందో అని కంగారు పడుతూ నేవున్నాడు. అయినా తప్పేదేముంది.

"లక్ష్మి! బెడ్డింగ్ సర్దావా!"

"సర్దాను బాబయ్యా!"

ఇంటిముందు జట్కాబండి ఆగింది. బండిలో బెడ్డింగ్ పెట్టొచ్చింది లక్ష్మి. మధుసూధనరావు నెమ్మదిగా రాధను దగ్గరకు తీసికొని - "జాగ్రత్తగా వుండు. కంగారేంపడకు. లక్ష్మిని యింటిదగ్గరే వుంచుకో. అన్ని విషయాలు లక్ష్మితల్లితో చెప్పాను" అని మధుసూధనరావు తలనిమిరి, రాధ చిరునవ్వు వీడ్కోలు తీసుకొని బండెక్కి గోదావరి స్టేషన్‌కి వెళ్ళిపోయాడు.

బండి వెళ్లిపోయినతరువాత రాధ బేలగా ఆవెళ్ళిన వంకే చూస్తూ నిలబడిపోయింది. మధుసూధనరావు ఎందుకైనా మంచిదని ఒక ఏభైరూపాయిలుకూడా రాధకిచ్చి వెళ్లాడు. రాధ, మధుసూధనరావు చిరునామాకూడా తీసుకుంది. లక్ష్మి రాధనువిడిచి యెక్కడకూ వెళ్ళడంలేదు. రోజూ రెండుమూడుసార్లు లక్ష్మి తల్లి వచ్చి చూసి వెళ్లిపోవడం జరుగుతోంది—.

నాల్గు రోజులకు మధుసూధనరావు వుత్తరం వ్రాశాడు. రాధ చదువుకొని—

"లక్ష్మీ! బాబుగారు వుత్తరం వ్రాశారే."

"ఏమనమ్మా"

"కులాసాగానే చేరుకున్నారట. నీ ఆరోగ్యం జాగ్రత్తగా కాపాడుకోవలసినది. లక్ష్మి కన్నా మనకు అండగా ఎవ్వరూలేరు. పనులు అయిపోగానే వస్తాను." అని వ్రాశారు.

ఉత్తరం చేరినరోజు రాత్రి మూడు గంటలకు రాధకు నొప్పులు ప్రారంభమయినయి. అమ్మగారు మూల్గుతోందేమిటని లక్ష్మి తటాలున లేచి కూర్చుంది.

"రాధమ్మగారూ! అమ్మను పిలవనా"

"ఊ...పిలూ...చాలా బాధగావుంది." లక్ష్మి యింటికి పరుగెత్తి—

"అమ్మా!" అని కేకపెట్టింది.

మంచి నిద్రలోవున్న అప్పలమ్మ చటుక్కున లేచి కూర్చుంది. లక్ష్మి చెప్పినవిషయంవిని, ప్రక్కనున్న రంగమ్మని, నాగాంని కూడాబెట్టుకొచ్చింది. అప్పటికి దాదాపు మూడుదాటింది. అప్పలమ్మ చాతయినంత వరకు రాధ ప్రసవవేదన నివారించడానికి ప్రయత్నించింది. ఆస్పత్రికి తీసికెళ్లితే మంచిదనిపించింది. వెంటనే గుర్రపుబండి మాట్లాడి ఆస్పత్రికి చేర్చారు. అక్కడ సుఖంగా ప్రసవించలేక చాలా కష్టపడింది. డాక్టరు చేయవలసిన ఇంజక్షన్లు చేసాడు. పెదవి విరిచిన మరుక్షణంలోనే లక్ష్మికి కళ్లనీళ్లుతిరుగాయి.

మధుసూధనరావు మధ్యాహ్నం బెంగుళూరు హోటల్లో (ఆఫీసుముందున్నది) కాఫీత్రాగుతుండగా టెలిగ్రాంఅందుకున్నాడు. త్రాగేత్రాగే కాఫీ అలాగేవుంచేసి టెలిగ్రాం చదువుకుని, ఒక్కనిట్టూర్పు విడిచి సాయంత్రం బండికి రాజమండ్రి బయలుదేరాడు. రెండురోజులు ప్రయాణం. చివరకు కళేబరమైనా చూపుకందుతుందేమోనని భ్రమించాడు. రాధనుంచి తన్ను వేరుచేయడానికని అవతరించాడేమో అనిపించింది పుట్టిన శిశువు తలపుకొచ్చేటప్పటికి. మధుసూధనరావుకి తెలియక పోలేదు. 'రాధకు తనను చేసుకోవడం యిష్టంలేదని, తండ్రి, బామ్మ యిద్దరూ బలవంతాన రాధకు తాళికట్టించారని. కాపురానికొచ్చిన మొదట్లో రాధకొంతకాలం తనమీద అదో రకమైన భావం కలిగివుండటంవల్ల ఆ అభిప్రాయాన్నే లాగైనా మార్చి, రాధజీవితంకి యే విధమైన కష్టం కలిగించకుండా, ఏమాత్రంకూడా మనస్సు నొచ్చుకోకుండా చేయాలని తానెంతగానో ప్రయత్నించక పోలేదు' చివరకు రోజులు దొర్లుతున్న కొద్దీ రాధ హృదయంలో మార్పురాక తప్పిందికాదు. మొదట్లో 'నాకీసంబంధం నచ్చలేదు, బలవంతాన తాళి కట్టించుకున్నాను.' అని యింకా యేవో పిచ్చితలపులు తల్చుకున్న రాధ, మధుసూధనరావు చూపుతున్న ప్రేమాభిమానములు చూరగొని "తన తలంపులు చాలా పొరబాటైనవని" చాలాసార్లు అనుకొని నాలిక కొరుక్కున్న రోజులున్నాయి. లక్ష్మితోగూడ యీ మాటలు ఒకటి రెండుసార్లు చెప్పింది. రాధ హృదయంలో వేధిస్తున్నది యిప్పుడొకటే - తనవాళ్లెవరూ ఆపదసమయంలోకూడా అదుకోలేక పోయారే! అనే తలపే. యిదేవాక్యం డాక్టరు పెదవి విరిచి నప్పుడుకూడా చాటున తిట్టింది. తరువాత కొద్ది క్షణాలకు తనకు స్పృహలేక్కపోవడంవల్ల, ఏంజరిగిందీ తెలుసుకోలేక పోయింది.

స్పృహ తప్పిపోతుందనగాలక్ష్మిని పిల్చి-"లక్ష్మి! బాబుగారొస్తే పాపాయిని చూపించు-యిదిగోతాళం చెవి. జాగ్రత్త" అన్నమాటలు యింకా పూర్తిగాక ముందే...లక్ష్మి బావురుమనడం, పొత్తిళ్లలో పాపాయి "క్యావ్"మని బిగ్గరగా కేకవేసి వూరుకోవడం రాధ మెదలకుండా విని వూరుకున్నట్టుంది.

మధుసూదనరావు రైలుదిగి సరాసరి హాస్పటల్‌కి వచ్చేసాడు. లక్ష్మి, వాళ్లమ్మ, యింకా కొంతమంది తన్నెరుగున్నవారు, తనరాకకోసం ఎదురుచూస్తున్నట్లున్నారు. ఒక్కసారి పొంగివచ్చే దుఃఖాన్ని ఆపుకోలేక జేబురుమాలు అడ్డుపెట్టుకొని వెక్కి వెక్కి

ఏడ్చినాడు. మధుసూధనరావును బాగా ఎరుగున్న పద్మనాభం దగ్గరికొచ్చి "ఊరుకో మధూ ఏంచేయగలం?" అని ఓదార్చాడు. అంతకన్న ఎవరుమాత్రం ఏంచేయగలరు?

చేయవలసిన కర్మకాండలు పూర్తిచేసి యింటిముఖంపట్టి, తాళంతీయకుండానే వాకిట్లోకూర్చొని చాలాసేపు చంటిపిల్లవాడిలాగా ఏడ్చాడు. ఎవ్వరికీ వుత్తరాలు వ్రాయడానికి మనస్కరించలేదు. తరువాత బాగుండదేమోనని అవసరమైన వాళ్లకు ఆరోజునే వ్రాసిపారవేశాడు.

ఆరోజు సాయంత్రం ఏమీతోచక, యింట్లో కూర్చుంటానికేం తోచక, ఎక్కడికీ వెళ్లడం! అనుకొని "గోదావరి" తీరంకి నెమ్మదిగా దారితీసాడు. రోడ్డువెంట చేతులు వెనక్కికట్టుకొని వస్తుంటే, ప్రక్క కాఫీహోటల్ లోంచి .

"జగమే మాయ, బ్రతుకేమాయ ... వేదాలలో సారమింతేనయా..." అని పాట తనకొక్కసారిగా జ్ఞానబోధ చేసినట్లనిపించింది. అప్రయత్నంగావచ్చిన అర్థంలేని చిరునవ్వుతో సూర్యాస్తమించే సమయానికి గోదావరి గట్టుకు చేరాడు. పారుతున్న నీళ్ల వంకచూస్తూ "వేదాలలో సారమాయిది?" అనిఒక్క నిట్టూర్పు విడిచాడు.

---

నాల్గు రోజులకు మధుసూధనరావు వుత్తరం వ్రాశాడు. రాధ చదువుకొని—

"లక్ష్మీ! బాబుగారు వుత్తరం వ్రాశారే."

"ఏమనమ్మా"

"కులాసాగానే చేరుకున్నారట. నీ ఆరోగ్యం జాగ్రత్తగా కాపాడుకోవలసినది. లక్ష్మి కన్నా మనకు అండగా ఎవ్వరూలేరు. పనులు అయిపోగానే వస్తాను." అని వ్రాశారు.

ఉత్తరం చేరినరోజు రాత్రి మూడు గంటలకు రాధకు నొప్పులు ప్రారంభమయినయి. అమ్మగారు మూల్గుతోందేమిటని లక్ష్మి తటాలున లేచి కూర్చుంది.

"రాధమ్మగారూ! అమ్మను పిలవనా"

"ఊ...పిలూ...చాలాబాధగావుంది." లక్ష్మి యింటికి పరుగెత్తి—

"అమ్మా!"అని కేకపెట్టింది.

మంచి నిద్రలోవున్న అప్పలమ్మ చటుక్కున లేచి కూర్చుంది. లక్ష్మి చెప్పినవిషయంవిని, ప్రక్కనున్న రంగమ్మని, నాగాంని కూడాబెట్టుకొచ్చింది. అప్పటికి దాదాపు మూడుదాటింది. అప్పలమ్మ చాతయినంత వరకు రాధ ప్రసవవేదన నివారించడానికి ప్రయత్నించింది. ఆస్పత్రికి తీసికెళ్లితే మంచిదనిపించింది. వెంటనే గుర్రపుబండి మాట్లాడి ఆస్పత్రికి చేర్చారు. అక్కడ సుఖంగా ప్రసవించలేక చాలా కష్టపడింది. డాక్టరు చేయవలసిన ఇంజక్షన్లు చేసాడు. పెదవి విరిచిన మరుక్షణంలోనే లక్ష్మికి కళ్లనీళ్లుతిరుగాయి.

మధుసూధనరావు మధ్యాహ్నం బెంగుళూరు హోటల్లో (ఆఫీసుముందున్నది) కాఫీత్రాగుతుండగా టెలిగ్రాంఅందుకున్నాడు. త్రాగేత్రాగే కాఫీ అలాగేవుంచేసి టెలిగ్రాం చదువుకుని, ఒక్కనిట్టూర్పు విడిచి సాయంత్రం బండికి రాజమండ్రి బయలుదేరాడు. రెండురోజులు ప్రయాణం. చివరకు కళేబరమైనా చూపుకందుతుందేమోనని భ్రమించాడు. రాధనుంచి తన్ను వేరుచేయడానికని అవతరించాడేమో అనిపించింది పుట్టిన శిశువు తలపుకొచ్చేటప్పటికి. మధుసూధనరావుకి తెలియక పోలేదు - 'రాధకు తనను చేసుకోవడం యిష్టంలేదని, తండ్రి, బామ్మ యిద్దరూ బలవంతాన రాధకు తాళికట్టించారని. కాపురానికొచ్చిన మొదట్లో రాధకొంతకాలం తనమీద అదో రకమైన భావం కలిగివుండటంవల్ల ఆ అభిప్రాయాన్నే ఎలాగైనా మార్చి, రాధజీవితంకి యే విధమైన కష్టం కలిగించకుండా, ఏమాత్రంకూడా మనస్సు నొచ్చుకోకుండా చేయాలని తానెంతగానో ప్రయత్నించక పోలేదు' చివరకు రోజులు దొర్లుతున్న కొద్దీ రాధ హృదయంలో మార్పురాక తప్పిందికాదు. మొదట్లో 'నాకీసంబంధం నచ్చలేదు, బలవంతాన తాళి కట్టించుకున్నాను.' అని యింకా యేవో పిచ్చితలపులు తల్చుకున్న రాధ, మధుసూధనరావు చూపుతున్న ప్రేమాభిమానములు చూరగొని "తన తలంపులు చాలా పొరబాటైనవని" చాలాసార్లు అనుకొని నాలిక కొరుక్కున్నరోజులున్నాయి. లక్ష్మితోగూడ యీ మాటలు ఒకటి రెండుసార్లు చెప్పింది. రాధ హృదయంలో వేధిస్తున్నది యిప్పుడొకటే - తనవాళ్లెవరూ ఆపదసమయంలోకూడా అదుకోలేక పోయారే! అనే తలపే. యిదేవాక్యం డాక్టరు పెదవి విరిచి నప్పుడుకూడా చాటున తిట్టింది. తరువాత కొద్ది క్షణాలకు తనకు స్పృహలేకపోవడంవల్ల, ఏంజరిగిందీ తెలుసుకోలేక పోయింది.

స్పృహ తప్పిపోతుందనగాలక్ష్మిని పిల్చి-"లక్ష్మీ! బాబుగారొస్తే పాపాయిని చూపించు-యిదిగోతాళం చెవి. జాగ్రత్త" అన్నమాటలు యింకా పూర్తిగాక ముందే...లక్ష్మి బావురుమనడం, పొత్తిళ్లలో పాపాయి "క్యావ్"మని బిగ్గరగా కేకవేసి వూరుకోవడం రాధ మెదలకుండా విని వూరుకున్నట్టుంది.

మధుసూదనరావు రైలుదిగి సరాసరి హాస్పటల్‌కి వచ్చేసాడు. లక్ష్మి, వాళ్లమ్మ, యింకా కొంతమంది తన్నెరుగున్నవారు, తనరాకకోసం ఎదురుచూస్తున్నట్లున్నారు. ఒక్కసారి పొంగివచ్చే దుఃఖాన్ని ఆపుకోలేక జేబురుమాలు అడ్డుపెట్టుకొని వెక్కి వెక్కి

# స్త్రీ సమస్యలు



## విద్య

శ్రీమతి వాసిరెడ్డి సుశీలాదేవి

మానవ సంస్కృతి ఒకప్పుడు నిద్రాణమై మరొకప్పుడు తేజోవంతంగానుంటుంది. మానవజీవిత జ్యోతి సంస్కృతి, జాగృతి, సభ్యత, నాగరకతల నాధారం చేసికొని వెలుగుతుంటుంది. లేనివస్తువును మానవుడు నూతనంగా సృష్టించలేడు.

స్త్రీలలో విద్య, సంస్కృతి, సంస్కారములు వేదకాలమునాటినుండి అవిచ్ఛిన్నముగా నుంటూయున్నట్లు చరిత్రాధారములున్నవి. అన్ని రంగాలలోను వేదకాలం, బౌద్ధయుగం, మహమ్మదీయ యుగము, ఆంగ్లయుగములలో భారత మహిళలు పురోగమిస్తూనే యున్నారు..

వేదకాలమునందు ఆనాటి సాహిత్యమును, చిత్రకళాఖండములను తరచిచూచినచో స్త్రీ ప్రతిజీవిత రంగంలోను పురుషునితోబాటు తన శక్తి సామర్థ్యములతో జాతికొక ఆకారమునిచ్చినట్లు తెలియగలదు. దరిమలా గాంధీయుగంలో నిద్రాణమైయున్న మానవునిలోని చైతన్యాన్ని రేకెత్తించి స్వాతంత్ర్య సమరంలో ధైర్య సాహసాలతో భారతమహిళలుపోరాడి విజేతలయినారు.

గాంధీ యుగానికి పూర్వము రాజులు, జమీందారులు నిరంకుశంగా వ్యవహరించి స్త్రీని విలాసవస్తువుగా, పరిగణించి, దాని ననుసరించిన రచనలకే కొంతకాలం ప్రాధాన్యత యుండింది. కాని ఫ్రాన్స దేశంలో చెలరేగిన విప్లవం, దాని ననుసరించి రష్యా అమెరికా, ఆసియా దేశాలలో చెలరేగిన విప్లవాలు మానవునిలో నవోత్సాహాన్ని, పురోగమనాన్ని ప్రోత్సహించినవి. ఆ ఉత్సాహం, స్వాతంత్ర్య పిపాస పురుషులలోను, స్త్రీలలోను కారుచిచ్చులాగ వ్యాపించినవి. దాని ఫలితమే భారత స్వాతంత్ర్య సమరంలో ప్రజలు అఖండ త్యాగాలు చేయడం, మనకు స్వాతంత్ర్యము సిద్ధించడము జరిగినవి. ఇదేకాకుండా రాజపుత్రుల • కాలంలో స్వాతంత్ర్య రక్షణకుగాను స్త్రీలు చూపిన ధైర్యసాహసములు, క్షాత్రధర్మము యీనాడు సయితం ప్రజలలో నూతనోత్తేజానికి

కారణమగుచున్నవి. అవసరాన్నిబట్టి, అవకాశాలనుబట్టి స్త్రీల శక్తి సామర్థ్యాలు, సహనము, సౌందర్య లావణ్యములు మానవాభ్యుదయానికి వినియోగపడవలసియున్నది. దానియొక్క అవసరమును ఎవరును విస్మరింపజాలరు.

స్త్రీమూర్తిలోని సహనము, కోమలము, మాధుర్యము, సౌందర్యము, కళాపిపాస ముమ్మాటికి నశించరాదు. అవి మరింతగా మానవ జీవితాన్ని కళాకాంతులతో సౌభాగ్యవంతం చేయాలి.

స్త్రీ సృజని. ఆమె ఆశక్తిని ఏ పరిస్థితులలోను కోల్పోకూడదు. సంగీతము, నృత్యము, చిత్రలేఖనములాంటి చిత్రకళల ఆరాధనతో కళాకారులుగా చీకటినుండి వెలుగు, కష్టమునుండి సుఖమును సమకూర్చ కలుగాలి. అంతమాత్రంచేత కుటుంబ జీవితంలో గృహనిర్వహణను నిర్లక్ష్యంగా చూడాలనికాదు. స్త్రీ పురుషులు ఉభయుల హక్కులను, అవకాశములను గుర్తించి స్వేచ్ఛావాతావరణంలో కుటుంబజీవితమును సుఖప్రదంగాను, సౌభాగ్యవంతంగాను రూపొందించుకోవాలి. అంతేకాని కుటుంబజీవితంలో అధికారవాంఛకు, నిరంకుశత్వానికి తావులేదు. స్త్రీ పురుషులలో నెవరు బాధ్యతారహితంగా వ్యవహరించినను కుటుంబంలో అశాంతి, అసౌఖ్యములు ఏర్పడును.

మహిళాపురోభివృద్ధికిగాను, రాజారాం మోహన్‌రాయ్, శ్రీ వీరేశలింగంపంతులు లాంటి మహనీయులు అమోఘంగా కృషి చేసినా, యీనాడు శాసనసభల్లో స్త్రీలకు తగిన ప్రాతినిధ్యము లేకుండుటకు దానియొక్క ఆవశ్యకతను పురుషులు సానుభూతితో చూడకపోవడమే కారణము. విశాల భావాలతో కుటుంబ సంబంధమైన సమస్యల పరిష్కారానికి స్త్రీలతోడ్పాటు, అందుకుగాను శాసన సభలలో వారికి ప్రాతినిధ్యము అత్యవసరము. ప్రతియొక్క గృహము శాంతి సౌభాగ్య నిలయాలుగా చేయగల విద్యా సంస్కరణకు, విద్యా బోధనకు మహిళలు అమోఘంగా తోడ్పడగలరు. ప్రతి గృహములోను, సమరస సద్భావములు, ప్రేమ యుండగా క్రమంగా లోకంలో మానవ సమాజములోనే శాంతి సౌభాగ్యాలకు లోటుండదు.

ప్రతి స్త్రీ తాను విద్యావతియై, దాని ఫలితంగా ఆర్జించిన విజ్ఞానాన్ని తన చుట్టూయున్న పరిస్థితులను అవసరమయితే సంస్కరించి సహకార సౌజన్యములతో తమ తమ కుటుంబాలను ఉన్నంతలో స్వర్గతుల్యంగా చేసికోవాలి. ఆహారనియమాలలోనేమి, అలంకరణలోనేమి, గృహోపకరణముల సమకూర్చుకొనుటలోనేమి స్త్రీల విద్యా విజ్ఞానములు విశేషంగా నుపకరించాలి. వీటన్నిటికి నైతిక నైర్మల్యము, జ్ఞాన తేజము కలిగినదిగ్గా రూపొందిన విద్య మార్గదర్శకము కావలసియున్నది.

# శ్రీ కస్తూరిదేవి పారిశ్రామిక విద్యాలయము

## నెల్లూరు



దేశాభ్యుదయమునకు, జాతీయోన్నతికి విద్యతో పాటు కళలు, పరిశ్రమలు అత్యంత ప్రధానములు, కళాకలితములు. పారిశ్రామిక సంపన్నములైన విద్యా విజ్ఞానములు తేజస్వంతిములై విరాజిల్లగలవు. దేశము సర్వశక్తిసంపన్నమై, జాతి సర్వతోముఖాభ్యుదయముతో పెంపొందుటకుసామాన్యప్రజానీకానికి అన్నవస్త్రాలు చేకూర్చగల స్వయం పోషకమైన విద్యా విధానము, విజ్ఞానసంపత్తి నేడు విధిగా కావలసి యున్నది. కేవలము కాలేజి, హైస్కూలు విద్యా విధానములు మాత్రమేగాక, స్త్రీలకు అత్యావశ్యకములైన గృహపరిశ్రమలు, లలితకళలు నెలకొల్పుట ముఖ్యముగా మా ఉద్దేశ్యములలో నొకటి. ఈ ఆశయముతో శ్రీ కస్తూరిదేవి పారిశ్రామిక విద్యాలయము స్థాపించినాము.

ఈ పారిశ్రామిక సంస్థ ముఖ్యముగా వయోజనులైన యువతుల కొరకు ఉద్దేశింపబడియున్నది. ఆయా కళలయందు అభిరుచిగల యువతులకందరకును ఇందు ప్రవేశముకలదు. మరియును అనేక కారణాలచే ఆర్థిక దుస్థితికిలోనై జీవనోపాధికి ఆర్జించుకోవలసి యున్న యువతులకును, స్కూలు ఫైనలు వరకైనను చదువులు కొనసాగించుకొన లేని విద్యార్థినులకును, ఇది అత్యంత ప్రయోజనకారి కాగలదు. స్వయంశక్తి మీద ఆధారపడి గౌరవంగా జీవయాత్ర గడుపుకొనగల శక్తిసామర్థ్యాలు అలవడి బ్రతుకు తెరువు కల్పింపగలదు.

ఈ విద్యాలయములో ప్రభుత్వ పారిశ్రామిక శాఖవారి ఆమోదముతో వారి నియమావళి, విధానాలు ఆధారంగా బోధనగరపబడుతూ గవర్నమెంటు పరీక్షలకు శిక్షణ ఈయబడును. కృతార్థులకు గవర్నమెంటు సర్టిఫికెట్లు లభింపగలవు. ఈ ట్రైనింగులో ఉత్తీర్ణులైనవారు ఆయా పాఠశాలలలో ఉద్యోగార్హులగుటయే గాక స్వయంశక్తి సమన్వితులు, స్వతంత్ర సంపాదనా పరులు కాగలరు. పరీక్షలకు పోయేవారికే గాక వర్కర్లనుకూడా తయారు చేయగలము. యిచ్చట విద్యార్థినులకు E. S. L. C. పరీక్షకు అవసరమగు శిక్షణ నొసగి వారా పరీక్షకు ప్రైవేటుగా హాజరగుటకు తగు యేర్పాట్లు చేయబడును.

ఆంధ్ర యూనివర్సిటీ ప్రోఛాన్సలరు శ్రీయుత బి. గోపాలరెడ్డిగారి అధ్యక్ష్యమున, విద్యామంత్రి శ్రీ డాక్టరు ఎం. వి. కృష్ణరావుగారు ప్రారంభకులుగా శ్రీ కస్తూరిదేవి విద్యాలయ సంస్థాపకులు శ్రీ పొణకా కనకమ్మగారిచే, ఈ ఇండస్ట్రియల్ స్కూలు 16-8-1952 తేది స్థాపింపబడి, ఆ సంవత్సరమే ప్రభుత్వమువారిచే రికగ్నయిజు కాబడినది. ఇది ప్రత్యేకం స్త్రీల కమిటీచే నిర్వహింపబడుచున్నది. ఇది చిరకాలాశయము.

ఇందు గత 2 సం॥ నుండి వయోజనులైన యువతులు సుమారు 150 మంది చదివినారు. ఈ సంవత్సరము 80 మంది చదువుచున్నారు. పరీక్షలకు హాజరైనవారిలో 80% కృతార్థులైనారు.

మేము ఇక్కడ ఉత్పత్తి కేంద్రముకూడా నెలకొల్పినాము. స్త్రీలకు, పిల్లలకు వారివారి అభిరుచులకు తగిన రకరకాల కలంకారీ అద్దకాలు, ఎంబ్రాయిడరీపట్లు క్రొత్త క్రొత్త ఫ్యాషన్సుతో ముచ్చటగా నాణ్యంగా అన్నిరకాల ఉడుపులు తయారుచేసి సప్లయిచేయగలము. లాభం స్కూలుకే చెందుతుంది.

ప్రతి పరిశ్రమలోను సుశిక్షితులైన సమర్థులగు ఉపాధ్యాయినులచే గవర్నమెంటు పరీక్షలకు శిక్షణ ఈయబడును. గవర్నమెంటు పరీక్షలకు హాజరగు



విద్యార్థినులకు కనీస విద్యార్హత కుట్టు శాఖకు 5-వ తరగతి, అద్దకంశాఖకు 3-వ ఫారము. పరీక్షలకు హాజరుగాకుండా పనులు మాత్రమే నేర్చుకొనువారికియీ నియమము అవసరము లేదు.

ఆయాశాఖల ననుసరించి ఒకటి, రెండు సంవత్సరములు ఈ (శిక్షణా ట్రైనింగు కోర్సు) ఉండును. జీతములు నెలకు మొదటి సంవత్సరం రు 2/- రెండవ సంవత్సరం రు 3/లు చొప్పున విద్యార్థినులవద్ద వసూలు చేయబడును. బీద పిల్లలైనచో శిక్షణ ఉచితము.



పొరుగూళ్ల నుండి వచ్చు విద్యార్థినుల సౌకర్యము ఈ సంస్థ యజమానులు పక్షమున ప్రత్యేకముగ వేరే హాస్టలుగూడ నడుపబడుచున్నది. సదరు హాస్టలు ఛార్జీలు నెలకు రు 18/-లు మాత్రమే. శ్రీ కస్తూరి దేవి పారిశ్రామిక విద్యాలయము అచిరకాలములోనే ఇట్టి అభివృద్ధితో వర్ధిల్లుతున్నదని తెల్పుటకు మిక్కిలి సంతోషిస్తున్నాము. ఇందుకు సర్వవిధాల తోడ్పడిన అభిమానులందరికి మా కృతజ్ఞతాపూర్వక ధన్యవాదములు.



ఇంకను ఎంతో కృషి కావలసి యున్నది. ఉదార హృదయులు సర్వదా మాకు ఇతోధిక ప్రోత్సాహముతో చేయూత నివ్వగలరని అర్థిస్తున్నాము. భారత ఆర్థిక మంత్రి శ్రీ చింతామణి దేశ్‌ముఖ్, కేంద్ర సాంఘిక సంక్షేమ సంస్థ అధ్యక్షురాలు శ్రీమతి దుర్గాబాయి గార్ల ఆంధ్ర దేశ పర్యటనములో, 20-6-54 తేదీ ఇండస్ట్రియల్ టీచర్సు ట్రైనింగు కోర్సునున్నూ, నేతశాఖనున్నూ శ్రీ దేశ్‌ముఖ్ దంపతులచే ప్రారంభోత్సవము గావింపబడినది. తన ప్రారంభోపన్యాసములో శ్రీమతి దుర్గాబాయిగారు యిట్లన్నారు:—

"శ్రీమతి పొణకా కనకమ్మగారు నాకు గురుతుల్యులు. నాకు వారి యెడలగల గౌరవమువల్ల నా యంతట నేనే యిచ్చకొనివచ్చి యీ కార్యమును జరుపుతున్నాను. నా కార్యక్రమములో నెల్లూరు చేర్చబడియుండలేదు." మా కృషికి కేంద్ర సంక్షేమ బోర్డువారు ఈ సంస్థకు రు. 15 వేలు సాలీనా గ్రాంటును మంజూరు చేసిరని తెల్పుటకు ఆనందిస్తున్నాము: స్టేటు గవర్నమెంటు గ్రాంట్లు ఇంకను రాలేదు. ఇదిగాక ఉదారంగా స్థానిక, జిల్లా ప్రముఖుల నుండియు నృత్య, నాటక సమాజాలూ, సినిమా నటీనటుల ఉచిత ప్రదర్శనాల మూలంగాను సుమారు 20 వేలు విరాళాలు లభించినవి.

ఇందు ప్రస్తుతమున్న శాఖలు :-

1. కుట్టుశాఖ : కత్తిరింపులు, కుట్టు, ఎంబ్రాయిడరి, ఉడుపులు తయారుచేయుట, చెమ్కీ, జరీకుట్టుపనులు, మెషీన్లపై బనియన్లు, ఊలు, లేసు అల్లికలు. (2 సం॥ శిక్షణ)

2. అద్దకంశాఖ : వస్త్రములపై వివిధరకాల అద్దకాలు, ప్రింటింగులు, బ్లీచింగుసహా శాస్త్రయుక్తంగా, [సైంటిఫిక్.] (1 సం॥ కోర్సు.)

3. నేతశాఖ : వివిధరకాల డిజైన్లలో చక్కని జరీ సాదా 60, 80, 100 నెం. చీరలు, జంఖానాలు, దుప్పట్లు, తువాళ్లు మరియు నవారు నేత :- (1 సం॥ కోర్సు)

4. ఇండస్ట్రియల్ టీచర్సు ట్రైనింగు కోర్సు : కుట్టుశాఖలో ఉత్తీర్ణులైన విద్యార్థినులకు టీచర్సు ట్రైనింగు (1 సం॥ ట్రైనింగు)

5. తదితరములు : పేముపని, క్రాఫ్ట్ వర్కు, చేతిసంచులూ, మనీపర్సులూ, నవారు నేత, నేత, బుక్ బైండింగు, చాపలు, అల్లిక వగైరా చేతిపనులు.

మిగిలిన శాఖలన్నియు క్రమేణా ప్రవేశపెట్టబడును.

6. హైస్కూలు : శ్రీ కస్తూరిదేవి విద్యాలయము గరల్సు హైస్కూల్ స్థాపించి 9 సం. అయినది.

1 ఫారం మొదలు స్కూలుఫైనలువరకు ఉన్నది. సుమారు నాలుగువందలు విద్యార్థినులు చదువు చున్నారు. హాస్టలులో ఏబదిమందికలరు. ఇందు కాలేజి విద్యార్థినులకుకూడ వసతి ఈయబడుచున్నది.

ఈ హైస్కూలులో సంస్కృతము హిందీకూడ ప్రత్యేకముగా బోధింపబడుచున్నది. అసలు మాతృ సంస్థ అయిన శ్రీ కస్తూరిదేవి విద్యాలయము 30 సం. క్రితము తొలుత జాతీయవిద్యాపీఠముగ స్థాపింపబడి పూజ్యబాపూజీ మన్ననలు పొందినది.

గాంధీమహాత్ములు "నెల్లూరులో చూడదగినసంస్థ ఏదైనవున్నదా అంటే అది కస్తూరిదేవి విద్యాలయమ్" అన్నారు.

కార్యవర్గము:—అధ్యక్షులు: శ్రీ పొణకా కనకమ్మగారు; కార్యదర్శులు: శ్రీ డి. లక్ష్మి బాయమ్మగారు, శ్రీ డాక్టరు (Mrs) మాత్యూస్; కార్యవర్గము: శ్రీ బెజవాడ లక్ష్మీకాంతమ్మగారు, శ్రీ రేబాల సుజాతమ్మగారు, శ్రీ డాక్టర్ ఎస్. లక్ష్మిగారు, శ్రీ పోకూరి రాఘవమ్మగారు, శ్రీ పైడా సుశీలమ్మగారు, శ్రీ మేరి జ్ఞానయ్యనాయుడుగారు, శ్రీ సి. వి. లక్ష్మిరెడ్డిగారు, శ్రీ మ. హేమలతగారు శ్రీ పి. వసుంధరగారు.

---

# తెలిసికొనతగినవి

పంచవర్ష ప్రణాళిక అతిచురుకుగా సాగడానికి 1954-55 సంవత్సరంలో ఖర్చు నిమిత్తమై 30 కోట్ల రూపాయలు కేంద్రపవర్ వర్క్సు శాఖచేతిలోనున్నది.

♦ ♦ ♦

ఇండియాలో మొదటిరైలు మార్గం 101 సంవత్సరాలకుముందు ప్రారంభించ బడింది. దూరప్రయాణంచేసే 3వ తరగతి ప్రయాణీకులకు తొలిసారిగా పండుకునే సౌకర్యాలు కల్పించబడనున్నవి. రైళ్లలోని ఫలహార, భోజనశాలలలో మూడవ తరగతి ప్రయాణీకులకు సయితం ప్రవేశం కల్పించడానికి రైల్వేబోర్డు ఆసక్తి చూపు చున్నది. అన్ని రైల్వేస్టేషనులలోను ప్రయాణీకుల సౌకర్యార్థం సమాచారశాఖలు నెలకొల్పబడుతవి.

♦ ♦ ♦

1947 ఆగష్టునెల 15వ తేదీకి పూర్వం జారీవేయబడిన పోస్టలుబిళ్లలు, సర్వీసు బిళ్లలు చెల్లనేరవని ఇండియా ప్రభుత్వము సెప్టెంబరు 9వ తేదిన ప్రకటించింది. దీని ననుసరించి 1947 ఆగష్టు 15కు పూర్వం జారీచేయబడిన తపాలుబిళ్లలు, సర్వీసు బిళ్లలు, పోస్టుకార్డులు, కవర్లు కలవారు సెప్టెంబరు 9నుండి మూడు నెలలలోపల పోస్టాఫీసులలో నిచ్చినచో అదేమూల్యంగల క్రొత్తకార్డులు, కవర్లు, బిళ్లలు యివ్వబడుతవి. అలాగే సర్వీసు బిళ్లలను ప్రభుత్వఖజానాలో మార్చుకొనవచ్చును.

భారత ప్రభుత్వ సమాచారశాఖ

# మాలో వచ్చిన మార్పు

శ్రీ సి. సి. పున్నయ్య



అప్పట్లో రాణి నన్ను అంతగా ఆకర్షించడానికి ఆమె యవ్వనము కారణము కాదు. అప్పుడామెకు మహా యుంటే 11 సంవత్సరాల వయస్సుంటుదేమో! జాకెట్టుకు సరిగ్గా గుండీలయినా పెట్టుకోకుండా రేగిన ముంగురులు గాలికి ముఖముమీద చిందులు త్రొక్కుతూ "బావా! బావా!" అంటూ నా వెంబడి తిరుగుతుంటే దేవకన్యలాగుండేది. ఆమె పెంకెతనాన్ని మరుగుపరచే అమాయికపు చూపులు కొంటెతనము నన్ను ఆకర్షింపజేశాయి - ఆకర్షించడమేమిటి!- ఆమెనుగిచ్చియో, ఏదో పేరుపెట్టి పిలిచియో ఆమెచేత తిట్లుతినడం, ఒక్కొక్కప్పుడు ఆమె కొట్టడం, గిచ్చడం, కొరకడం పరిపాటిగా నుండేది. ఆ గాట్లు యీ నాటికింకా గతాన్ని స్ఫురణకుతెస్తూ నన్ను పిచ్చివాణ్ణి చేస్తుంటవి. పండువెన్నెలను మరపించే ఆమె శరీరచ్ఛాయ, దొండపండులాంటి పెదవులతో గాలిపటంలాగ తిరుగుతుంటే ఆమెలోగల వ్యక్తిత్వపు ప్రత్యేకతను నేనొక్కణ్ణే గుర్తించి ఆరాధిస్తున్నాననుకునేవాడిని.

ఆ పిల్ల మా మామ కుమార్తె. కలరాలో తల్లిదండ్రులిద్దరు యించుమించుగా ఒక్కసారే చనిపోయారు. రాణి మా యింట్లోనే పెరిగి పెద్దదయింది.

ఊహాపోహాలు రాణివి మహాగొప్పవి. దాంతోపాటు పట్టుదల, పెంకెతనము పుట్టుకతోనే అబ్బినవి. ఒక క్షణంలో మనసు ఎంతకఠినమయిందో మరొక క్షణంలో అంత నవనీతమయిపోయేది. ఆమె రచ్చ ఒక్కొక్కప్పుడు నాకు ఎంతో చీకాకు కలిగించేది. కాని వెంబడే పరుగెత్తుకుంటూవచ్చి కళ్లల్లో కళ్లు పెడ్తూ "బావకు కోపమువచ్చినట్లుందే!- యింత

కోపమయితే ఎలాగ చెప్పు! - ఇదుగో చూడు - అత్తయ్య నాకు అణా యిచ్చింది. దానికి శనగపప్పు కొనుక్కొచ్చి, అందులో ఉప్పు కారం కలిపి నెయ్యి వేసి నిమ్మకాయ రసంపిండి తెచ్చేదా" అని గుక్క త్రిప్పుకోకుండా నేను 'ఊ' అనేదాక వేధించేది. ఇంట్లో గోంగూర పచ్చడి కాని, చింతపండు పచ్చడి కాని చేశారంటే అమ్మ చూచి కొంత, చూడక కొంత దుత్తలోని వెన్నలో చాల భాగం నా కంచములో వేసేది. ఇంట్లో ఏపిండివంట చేసినా అందరికంటె ముందు నాకు తెచ్చిపెట్టి నాతోపాటు తనూ తినేది. మా యింట్లో వేరే ఆడపిల్లలు లేకపోవడంవలన మా అమ్మ, నాన్న కూడ రాణిని చాల గారాబంగా చూచేవారు. అన్నం దగ్గర పాలు, పెరుగు, వెన్న త్రాగినంత, తిన్నంత నాకు వేసి రాణి తనుతిని ఆగడం చేస్తుంటే మా అమ్మ "ఇప్పుడే మీ రిద్దరు ఏకమై నాఅంతుకనుక్కుంటున్నారు: యిక ముందు ముందు మరీ ఎట్లాగుంటుందో" అని ఘురుసుకునేది.

మా తమ్ముడు వయస్సులో నాకంటె రెండు సంవత్సరాలు చిన్న. నేను ఇంటర్ మీడిఏటు చదువుతుండగా స్కూలు ఫైనలు చదువుతుండేవాడు. ఇంటర్ మీడిఏటు పరీక్షాఫలితాలు ప్రకటించగానే మా అమ్మ నాన్నతో "ఏమండీ! పిల్ల, పిల్లవాడు మన యింట్లోనే యున్నారాయ - యీ సెలవుల్లో మూడుముళ్లుపడితే బాగుంటుంది" అన్నది.

"బాగానేయుంది - చంద్రుడితో చెప్పిచూడు ఏమంటాడో."

♦ ♦ ♦

"రాణీ! మన యిద్దరికీ త్వరలో పెళ్లి కాబో తున్నది తెలుసా!" అన్నాను.

ఆ మాటలు రాణి ముఖచిహ్నాలలో ఎట్టిమార్పు తేలేదు.

"ఏమిటి - మాట్లాడవెందుకూ! - నీ కిష్టంలేదా? అలాగైతే పోనీలే" అన్నాను.

"ఇంతలో మునిగిపోయిందేమిటి బావా! నా స్కూలు ఫైనలు పూర్తికానియ్యి" అంది రాణి.

మరల కాలేజీలు తెరిచే రోజులు సమీపించినవి. నన్ను బి. ఎ., లా చదువుకు మద్రాసుకు పంపడానికి మా నాన్న నిశ్చయించాడు. కాని రాణికి, నాకు ఏర్పడనున్న ఎడబాటు నాలో మితిలేని బెంగకు కారణమయింది. రాణీ నాతోలేని క్షణాన్ని యుగంగాగడిపే నాకు ఒంటరిగా మద్రాసులో ఏలా కాలం గడుస్తుందా అనేది పెద్ద సమస్య అయింది. నేను మద్రాసుకు పోబోతున్నానని తెలిసి రాణి పరుగెత్తుకుంటూవచ్చి "బావా! నీవు మాత్రం మద్రాసు కెళ్లి హలాసాగా జీవితం గడుపబోతున్నావు; మరి నేనిక్కడ బిక్కుబిక్కుమంటూ..." అన్నది చెమ్మగిలిన కండ్లతో తలవంచుకొని.

"అయితే వెళ్లవద్దంటావా రాణీ! - చదువు పూర్తికాగానే వచ్చేస్తానుకదా! యీ లోపల ఎన్నిసార్లు వస్తుంటాను, పోతుంటాను!" అన్నాను ఆమె చేతులను నాచేతుల్లోకి తీసికొని.

"ఏమో బావా! నీవులేని యీ యింట్లో సర్వము శూన్యము కానున్నదేమోననిపిస్తున్నది. సంవత్సరాలు తరబడి నీవు నాకు దూరమైపోతావుకదూ!" అన్నది పొంగిపొరలే దుఃఖంతో.

"పిచ్చిపిల్లా! రోజు లెంతలో దొర్లిపోతవి! నేను మాత్రం నిన్ను విడిచి ఎంతకాలముండగలను! అమ్మ, నాన్నలను విసిగించకుండాయుండు" అని ఓదారుస్తూ రాణి కండ్ల నీళ్లనుచేతిగుడ్డతో తుడిచాను. తర్వాత నాలుగు రోజులకు మద్రాసుకు ప్రయాణమై వెళ్ళిపోయాను.

లా పరీక్షలు జరుగడానికి పది పదిహేను రోజు లున్న సమయము. దూరాభారమయినా అంతవరకు ప్రతిశలవుల్లోను యింటికి వెళ్ళి వస్తూనే యున్నాను. రాణి దగ్గరనుండి తరచుగా జాబులు రావడం, నేను వ్రాయడం జరుగుతుండేది.

పరీక్షరోజులు సమీపిస్తున్నకొద్దీ దీక్షగా చదువుతున్నాను. ఒక రోజున మా నాన్నదగ్గరనుండి 'రాణికి స్ఫోటకంపోసి ప్రమాదావస్థలోనున్నది' అని టెలిగ్రాం వచ్చింది. పరీక్షల హడావుడిలో నేను వెంటనే బయలుదేరిపోలేక నా ఆదుర్దాను తెలియ జేస్తూ రాణికి అవసరమైన వైద్యసదుపాయాలనుచేసి జాగ్రతగా చూడవలసిందిగా యింటికి జాబు వ్రాశాను. వారంరోజులకు ఆమె ఆరోగ్యము నెమ్మదిగానున్నట్లు జాబువచ్చింది.

పరీక్షలు అయిపోయి శలవులిచ్చారు. ఎప్పుడెపుడు ఊరికిచేరి రాణిని చూద్దామా అనే ఆదుర్దాతో రైలెక్కి కూర్చున్నాను. బండిలో ప్రయాణముచేసినంతసేపు రాణి ఆరోగ్యాన్ని గురించి, ఆమె రూపంలో స్ఫోటకం ఫలితంగా ఏర్పడిన మార్పులను గురించి - ఆమెయొక్క ప్రేమానురాగాలను, చిన్ననాటి సాంకేతనాన్ని తలచుకుంటూ, దారిలోని స్టేషనులలో బండి ఆగినప్పుడల్లా యింకా నాగమ్యస్థానం రాలేదని కసురుకుంటూ రాత్రల్లా కన్నుమూయకుండా గడిపాను. ఉదయం 6 గంటలయ్యేసరికి నేను దిగాల్సిన స్టేషను రానేవచ్చింది. దిగి యింటిముఖం పట్టాను.

ఇంటిగడపలో కాలుపెట్టీ పెట్టకముందే చేతిలోని బెడ్డింగును పరుగెత్తుకొనివచ్చి అందుకొనే రాణి కనుపించకపోవడం నన్ను కొంత కలవరపరచింది. మా అమ్మ కాళ్ళకు నీళ్లుతెచ్చియిచ్చి, కాఫీ తెచ్చియివ్వడానికి యింట్లోకి వెళ్ళింది.

కాళ్లుకడుక్కొని తుడుచుకుంటూ మా అమ్మ చేతిలోని కాఫీగ్లాసు అందుకొని హాలులోని సోఫాలో కూర్చొని-

"రాణి ఏదమ్మా! కనుపించలేదు" అన్నాను.

"ఇంట్లోనే ఏమూలనో యున్నది; పద స్నానం చేద్దువుగాని" అంది.

స్నానంచేసి భోజనానికి కూర్చున్నాను. కాని ఎప్పటిలాగ రాణి నా ప్రక్కన లేకపోవడం కొరతగానే యుండింది. ఏదో నాలుగు మెతుకులుతిని లేచి వెళ్ళాను.

రాణి ఎక్కడయుందా అని యిల్లంతా గాలించ మొదలుపెట్టాను. లోపలగదిలో పేముకుర్చీలో కూర్చొని ఏదో చదువుకొనుచుండుటను చూచాను. నేను వచ్చానని తెలిసికూడ రాణి ఏమిఎరుగనిదాని లాగ నుండటం నాకాశ్చర్యము కలిగించింది. మెల్లగా గదిలోకి ప్రవేశించి రాణిని సమీపించాను.

ఆ! _ రాణి రూపంలోని లావణ్యమేమైంది! అబ్బ ముఖముమీద పెద్దపెద్ద మచ్చలు, దేహమంతా నల్లకప్పేసి వికృతంగా రూపొందింది. అది చూచి నా కళ్లకు కారుచీకట్లు క్రమ్మినవి - మనసు పరిపరివిధాల పోయింది. ఆమె బాహ్య సౌందర్యం దెబ్బతిన్న మాట నిజమే; దానికి ఆమె ఎలాగ బాధ్యురాలు! ఆమె హృదయ సౌందర్యము మాత్రము చెక్కుచెదరి యుండదని నిర్ధారణచేసికున్నాను.

"రాణీ! నీ సౌందర్యము మాసిపోయిందని విచారపడుతున్నావుకదూ! దానికంటె నీ ప్రేమానురాగ పూరితమయిన హృదయ సౌందర్యాన్నే ఎక్కువగా ప్రేమించాను - ఆరాధించాను. నీకు నా హృదయంలోగల స్థానానికి ఎన్నటికీ చలనంలేదు" అన్నాను సమీపంలోనున్న కుర్చీకి ఆనుకుంటూ.

రాణి తలవంచుకునే ఆ మాటలు విన్నది.

వారంరోజులు గడిచినవి. ఒక రోజున ఎక్కడనుండియో రాణికి జాబువచ్చింది. దాన్ని తీసికొని వెళ్ళి చింపిచదువడం ప్రారంభించింది. వెనుకనే నేనుపోయి గదిగుమ్మం దగ్గర నిలబడిచూస్తూ నిలబడ్డాను. జాబు చదువుతూ, చదువుతూ వెక్కి వెక్కి ఏడ్వసాగింది. నేనది చూచి అప్పటికి వెనక్కు తప్పుకున్నాను.

గంటసేపయిన తర్వాత గదిలోకివెళ్ళిచూచాను. రాణి ముఖమునిండా గుడ్డకప్పుకొని నిద్రపోతున్నది. టేబిలుదగ్గర వచ్చిన ఉత్తరం చిన్నచిన్న ముక్కలుగా చించిపారేసియుంది. మెల్లగా దగ్గరకువెళ్ళి రాణిని తట్టిలేపాను. ఏదో కలవరపడ్డట్లు లేచి దూరంగా నిలబడింది. ఎర్రబడియున్న కళ్ళనుచూచి "ఏంరాణీ! కళ్లు ఎర్రబడియున్నవి - ఒంట్లో కులాసాగాలేదా" అన్నాను.

"లేదు బావా! నేనొక విషయం నీతో చెప్తాను-క్షమిస్తానని ప్రమాణంచెయ్యి" అన్నది ప్రాధేయపడ్తూ.

"అదేమిటి రాణీ! - క్షమించడం! - ఏమిటో చెప్పదలచుకున్నదిచెప్పు" అన్నాను సమీపముననున్న కుర్చీలో కూర్చుంటూ.

"నేను నీ ప్రేమకు అర్హురాలనుకాను. నామీద ఆశవదలిపెట్టు. నీప్రేమానురాగాలు గాఢమయినవి, పవిత్రమయినవని నాకు తెలిసీకూడ నిన్ను నేనింత కాలము ప్రియుడుగా ప్రేమించి ఆరాధించలేకపోయిన నిర్భాగ్యురాలను" అంటూ వెక్కి వెక్కి ఏడ్వసాగింది. నాకంతా అయోమయమయింది.

"అంటే..." అన్నాను అప్రయత్నంగా.

"ఇంతకాలము నీకు యియ్యని స్థానమును చిన్నబావకు నా హృదయంలో యిచ్చాను. అతడూ నన్నింతవరకు గాఢంగానే ప్రేమించాడు. కాని స్ఫోటకం ఫలితంగా నేననాకారినైనానని నన్ను తృణీకరిస్తూ వ్రాసినదే యీ జాబు." అంటూ చించిపారవేసి యున్న జాబుముక్కలను చూపింది.

"నీకు ద్రోహంచేశానని అంతర్వాణి ఘోషిస్తూనే యుంది. దానికి భగవంతుడు తగిన శాస్తి చేశాడు నాకు. ఈ సమయంలో నీకు చేసినద్రోహం కాక, నా దృష్టిని నీవైపుకు మరల్చునట్టి నీచురాలను కావడం నాకిష్టంలేదు. నీవు మరొక యువతిని వివాహమాడి సుఖపడ్తుంటే చూచి ఆనందించాలనే నా ఆశ"

నాకు ఆశ్చర్యంకలిగింది. దాంతోపాటుకోపం కూడవచ్చింది. కాని నేను ప్రేమించి, ఆరాధించిన మూర్తి నన్ను ప్రేమించి, స్వీకరించ నుద్దేశించనప్పుడు నేను ఆవేదనపడిమాత్రం లాభమేమిటి?

అప్పటినుండి రాణితో నామాటలు, సంబంధము పరిమితమయి పోయినవి. ఆమె నేను యిప్పుడు సోదరీ, సోదర తుల్యులము. నాకు వివాహమయింది. రాణి మాత్రం యావజ్జీవపర్యంతము అవివాహితగానుండ నిశ్చయించుకున్నది. ఆమె మాయింట్లోనేయుండి మాతో బాటు సర్వహక్కులు, అవకాశాలు అనుభవిస్తూ మాతో బుట్టవులలో, ఒకతె అయిపోయింది. మాలోవచ్చిన మార్పుకు కారణమును యీ నాడు, ఆనాడు, యికముందు కూడ మా తల్లి తండ్రులు తెలిసికోలేదు.

# విభిన్న ధ్రువాలు

శ్రీ తిరుమల వెంకటేశ్వర్లు

విజయలక్ష్మి, ఇరువురు పిల్లలు భోజనాల దగ్గర కూర్చున్నారు. ఆమె పెద్ద కొడుకు రఘు ఇంకా తాలూకాఫీసునుంచి రాలేదు. రెండో కొడుకు శేఖర్ యింకా కాలేజినుండిరాలేదు.

విజయలక్ష్మి కుటుంబం ఒకప్పుడు బాగా బ్రతికింది. కాని భర్త మరణంతో కుటుంబ స్థితి మారింది. అలాగే కష్టపడి కొడుకులను చదివించింది. పెద్దకొడుకు రఘుకు తాలూకాఫీసుల్లో గుమాస్తాపని దొరికింది. రెండో కొడుకు శేఖర్ ఇంటర్ చదువుచున్నాడు. మిగిలిన ఇద్దరు ఆరు, మూడు సంవత్సరముల వయస్సుగల ఆడపిల్లలు.

రఘు ఆఫీసునుండివచ్చి భోజనం దగ్గర కూర్చున్నాడు. విజయలక్ష్మి "శేఖర్ యింకా కాలేజినుండిరాలేదురా!" అన్నది.

"కాలేజిలో మళ్లా ఏంగొడవ తెచ్చుకొన్నాడో!" అన్నాడు రఘు.

భోజనాలు ముగిసినవి. గంట రెండయింది. అంతలో శేఖర్ వచ్చాడు.

"ఏరా! ఇంత ఆలస్యమైంది?" అంది తల్లి.

"ఈ రోజు కాలేజిలో విద్యార్థుల బహిరంగసభ. సభకు కావలసిన అరేంజిమెంట్స్ చేసి వచ్చేటప్పటికి ఇంత ఆలస్యమైంది"

"సభ దేనికిరా?" అన్నాడు రఘు.

"ఇప్పుడు కాలేజిలో చదువు తగ్గిపోయింది. లెక్చరర్లకు లంచాలు, వ్యసనాలు ఎక్కువైనాయి. లెక్చరర్లు షోకుగా టాయ్ లెట్ అయి వస్తారు. రకరకాల పోజులిస్తారు, కాని పాఠము లేమో చెప్పేది లేదు. మావిద్యార్థులకు సరైన సౌకర్యాలు లేవు. బిల్డింగు పూరిపాకలు. వర్షం వస్తే సెలవు. వీటినన్నిటినీ చూస్తూ ఊరుకోం!"

"ఏడవలేకపోయావ్! ఎవరెట్లాపోతే మధ్యలో నీకెందుకురా?"

"అవునుమరి, నీలాగే ఈ అన్యాయాలను చూస్తూ కూర్చోమంటావా?"

"నోర్ముయ్!" అంటూ శేఖర్ చెంపమీదబలంగా ఒకటి తగిలించాడు.

"ఏవిట్రా! వాడేదో తెలియక వాగితే పట్టుకొని కొడుతున్నావ్!" అంది తల్లి.

"వాడినింకా వెనకేసుకొనిరా! బాగుపడతాడు!" రఘు కోపంతో ఆఫీసుకు వెళ్ళిపోయాడు.

"ఏం కోపాలో ఏమో! రారా వచ్చి అన్నంతిను" అంది శేఖర్‌తో తల్లి.

"ఛీ! వెధవిల్లు! నీవు, నీ పెద్ద కొడుకు హాయిగా ఉండండి. ఇక చస్తే ఈ యింట్లో అడుగు పెట్టను."

శేఖర్ గబగబ వెళ్ళిపోయాడు.

శేఖర్‌కు పెట్టిన అన్నం పిల్లివచ్చి తిని పోయింది. విజయలక్ష్మి గుండె తరుక్కొని పోయింది.

♦ ♦ ♦

ఆ సాయంత్రం కాలేజిలో బహిరంగసభ. సభకు విద్యార్థులు, విద్యార్థినులు చాల మంది వచ్చారు. శేఖర్ లేచి స్టేజియెక్కి కాలేజిలోని అన్యాయాలను గురించి యుపన్యాసమిచ్చాడు. లెక్చరర్లలంచము, కష్టేజీతానికి సరియైన సౌకర్యములు లేక పోవుట, కొన్ని దండుగఫీజులు, పాకల బిల్డింగు మొదలగు విషయాలను గురించి గంభీరంగా యుపన్యాసమిచ్చాడు. అందరూ శేఖర్ కంఠధ్వనికి, ధైర్యానికి ఆశ్చర్య పోయారు. సభ జయప్రదంగా ముగిసింది.

అంతలో శేఖర్ ప్రియమిత్రుడు ఆనంద్ పరుగెత్తుకుంటూ వచ్చి "శేఖర్ ! సెలక్షన్సులో నెగ్గినవారి లిస్టు వేశారు. దాని లోనీ పేరు లేదు" అన్నాడు.

శేఖర్ ఆశ్చర్యపోయాడు. తను సెలక్షన్సులో తప్పుతానని కలలోగూడ అనుకో లేదు. గబగబ వెళ్ళి లిస్టు చూశాడు. తన పేరులేదు. నమ్మలేకపోయాడు. గబగబ ప్రిన్సిపాలు దగ్గరకు వెళ్ళి అడిగాడు. ప్రిన్సిపాలు కోపంతో ఉరిమిచూస్తూ—

"వచ్చావులే! పెద్ద చదివేవాడు బయలు దేరాడు! ఇంకా స్త లెక్చర్లుయివ్వు! బాగు పడతావ్"

"దానికీ దీనికి సంబంధం ఏమిటండీ?"

"ఇదే-ఫస్ట్ గెటవుట్ ?"

శేఖర్ అవమానంతో బయటకు వచ్చాడు. మసకచీకటి పడింది. కొందరు విద్యార్థులు శేఖర్‌ను చూసి హేళనగా నవ్వుకుంటూ వెళ్ళిపోయారు.

శేఖర్ రోడ్డుమీద నడుస్తున్నాడన్న మాటేగాని మనస్సు మనస్సులో లేదు. ఇక గత్యంతరం ఏమిటి? తొందరపాటుతో, ఆలోచనలేక యింటికి వెళ్ళనన్నాడు— మరియిప్పుడు ఎక్కడకు వెళ్ళడం !

తనజీవితంలో ఇంతవరకూ ఎక్కడా అపజయం పొందలేదు. ఇదే మొదటిసారి తప్పటం. భావి అపజయాలకుఇది పునాదా?

వెనక కారుహారన్‌తో ఉలిక్కిపడ్డాడు. డ్రైవర్ కోపంతో "ఏమయ్యా ! రోడ్డు మీద మధ్యలోనడువకూడదనీ తెలీదూ!" అని కారు వెళ్ళిపోయింది.

శేఖర్ మెల్లిగా రైల్వే స్టేషన్ చేరు కొన్నాడు. గంట ఎనిమిది దాటింది. స్టేషనంతా కోలాహలంగాయుంది.

మద్రాసు మెయిలు వచ్చింది. శేఖర్ ఎక్కి కూర్చున్నాడు. 'తను చేస్తున్నపని తప్పేమో?' అన్నది మనస్సు. 'లేకుంటే గత్యంతరం!' అన్నది హృదయం.

మెయిలు బయలుదేరింది. మరోనిముషంలో అంతవరకు నివసించిన స్వగ్రామమును, బంధువులను, కాలేజిని అందరినీ విడచి ఎక్కడికో దూరంగా వెళ్ళి పోయాడు శేఖర్.

# తాతయ్య ప్రహసనం

శ్రీ చేబ్రోలు సుబ్రహ్మణ్య శర్మ

——(౦)——

[బుద్ధిలేని మహారాజు సభలో పండితులకు ప్రతిఒక్కరికీ సన్మానం చేస్తానని ప్రకటించాడు. దాన్ననుసరించి తమ తమ పాండిత్యమును ప్రదర్శించి సన్మానాలు పొందడానికి అనేకులు వచ్చారు. సనాతనులు, వైదికశ్రేష్ఠులు, గాయకులు సన్మానాలు నందుకొనిన తర్వాత కవులను సన్మానించే సందర్భమున వివాదంగా పరిణమించేసరికి వారిని సన్మానించేందుకు ఏర్పాటుచేసిన సభకు అధ్యక్షుడుగాను, ఆస్థాన విద్వత్కవిగాను పేరూ, వూరులేని, చీము, నెత్తురులేని శంకయ్యను నియమించినట్లు మంత్రి ప్రకటించాడు — యిక చదువండి.]

(సెప్టెంబరు సంచిక తరువాయి)

## 4-వ రంగం

[ఆస్థాన విద్వత్కవియైన శంకయ్యాగారు అధ్యక్ష పదవి నలంకరిస్తారు.]

ఆస్థాన విద్వత్కవీశ్వరుడు:-ఓ మహామహులారా! మీరు మీ మీ విద్యలలో గొప్పవారని మీరిక్కడకు రావడంవల్లనే తెలిసిపోవుచున్నది. మీ యందలి దయవల్ల నాకీపదవి యీరోజున వచ్చినది. కాదను మీ మీ ఉద్దేశాలు ఎంతవఱకూ నిజమైనా నా హృదయానికి మట్టుక్కి మీ యందలి ప్రభావమువల్ల నాకే యీ పదవి వచ్చిందని మాత్రం గట్టి విశ్వాసం. మనకవుల కందఱకూ వుండే సామాన్య లక్షణాల్ని చెప్పగల ధీరులు, శూరులు ముందుకివచ్చి వివరించాలని కోరుతున్నాను.

వికటయ్యకవి:-అడుక్కొని తినడం కవి సామాన్య లక్షణాలలో ముఖ్యమైనది.

టొకటయ్యకవి:-ఇంతకన్న ముఖ్యాతి ముఖ్యమైనది ఏమిటంటే చెవులతో చూచే రాజుని, కళ్ళతో వినే మంత్రిని వశంచేసికొని కోటలో పాగా వెయ్యడం అని నా ఉద్దేశం.

వి.క:-చిల్లరి మల్లరి గణాచారులైన కవిమన్యులను పదిమందిని పదిదిక్కుల స్నేహం అనే మిషతో స్వకార్యోపసాధనాలుగా మంచుకొని అక్కడ సన్మానంచేయించు, ఇక్కడ సన్మానంచేయించు, ఎక్కడైనా సన్మానంచేయించు, అని ఆ స్నేహితుల్ని పీడించుకొని తినడంకూడా ముఖ్యలక్షణమే!

మంత్రి:-అల్పులు గణాచారులు ఏమి సన్మానం చేయించగలరండి బాబూ!

టొ.క:-మీవంటివారి మానుషత్వం కాస్తా 'ఎత్తే అగ్నే' చెప్పించడానికి ఆ గణాచారులు చాలు బాబూ!

వి.క:-బాగున్న కవిత్వాన్ని బాగాలేదనడం, బాగా లేని కవిత్వాన్ని చాలా బాగుందని పొగడడం అనేదికూడా ముఖ్యలక్షణాల్లోదే.

టొ.క:-మంచి లక్షణాలు చెప్తా వింటారూ?

ఆ.వి.క:-తప్పక వింటాం చెప్పండి.

టొ.క-తన కవిత్వాన్ని ఎవరు ఏరీతిగా విమర్శించినా ప్రతి విమర్శనము వ్రాయకుండా కిమిన్నాస్తిగా,

కిక్కురుమనకుండా ఉండడం, ఇతరుల కవిత్వానికి లేనిపోని వంకరలు తెచ్చిపెట్టకుండా వుండడం, అడిగినవాడికల్లా అభిప్రాయంఇస్తూ అందులో విషంపోయకుండా వ్రాయడం, ఇతరులు ఇతరుల గ్రంథాలికి వ్రాసిచ్చిన యభిప్రాయాలను విమర్శించకుండా వుండడం, ఏదైనా సభలో ఏకవి పండితునకైన సన్మానం జరుగుతుంటే వంకర టింకరగా మాట్లాడక సజావుగా మాట్లాడుతూ పెదవులు విరవక, కళ్లు చిట్లించక, వికృతచేష్టలు చేయక మర్యాద కాపాడుకొని మర్యాద నిస్తూ ఉండడం, చాటుచాటున తేలుపని, పాముపని నక్కపని చేయకుండా వుండడం, తనపేరు లేకుండా యితరుల పేరుపెట్టి యితరుల గ్రంథాల్ని విమర్శించి తిట్టి దిగజారపోయకుండా వుండడం వగైరాలు సల్లక్షణాలున్నాయి. వీటిని పాటించిన కవి ఇంతవఱకు కనబడడంలేదని మనం ఎఱుగున్న విషయం కనుకనే యీ నియమం గలవాడినే మహాకవి సార్వభౌముడందాం అని నా యభిప్రాయం.

ఆ.క.వి:- మంచి వుపన్యాసం మీ యిద్దరిదీని. మంత్రివర్యా! వీరిద్దరికీ చెరొక కాశ్మీరు శాలువా యిప్పించండి. చెరో నూటపదారు రూపాయలు ఇప్పించండి - కవివర్యులారా! సంతోషమేనా?

కవి:- మహా సంతోషం - అంతేచాలు బాబూ!

మం:- శాలువాలు, శుల్కం యిస్తూ మీ యిద్దరే యిందులో ఘనులని మేము నిర్ణయించి యీ సన్మానం చేస్తున్నాం.

ఇతరులు: ఉత్తి శుంఠకాయలా ఘనులు!

[అని సభలో కలకలం]

రాజు:- అదేమి అల్లరి మంత్రీ!

మం:- అది కవుల మర్యాదండి.

రా:- తిట్లు మర్యాదటయ్యా?

మం:- కవులకువచ్చిన పాండిత్యం అదేగదాండి.

రా:- అన్యాయం! అన్యాయం!

మం:- నాదా, కవులదా?

రా:- ఉభయులదీని.

మం:- ఎందుచేత?

రా:- కవుల పాండిత్యాన్ని సంకుచితపఱచేవు కనుక నీది - అల్లరి చేస్తున్నారు కనుక కవులది అన్యాయం.

ఆ.వి.క:- రాజచంద్రమా! మంత్రివర్యా! మీ తగవు లెందుకు? నేను ఓమాట చెప్తా వినండి. ఆ శాలువాలు ఆ శుల్కం నాకిచ్చివేసి, కవుల కందఱకు సరిసమానంగా ఖద్దరు శాలువా లివ్వండి. తగవు పరిష్కారం అవుతుంది.

మం:- సరే, సెబాస్! బాగావుంది పరిష్కారం-

[అని అందఱికి ఖద్దరుశాలువా లిప్పించి]

పుచ్చుకొన్నవాళ్ళు దయచేయండి.

కవులు:- రైలు ఖర్చులు ఎవరిస్తారు బాబూ!

మం:- ఎవరి కెంతెంతైందో చెప్పండి.

కవులు:- [పది, ఇరవై, నలభై, యాభై, అరవై - ఇట్లా పది యిరవై హెచ్చించి ఒకరినిమించి యింకొకరు చెప్పడం ప్రారంభించారు.]

మం:- రైలు ఖర్చులు మేమిస్తామనలేదే!

కవులు:- ఇస్తామని వేరే అనాలా? రండీ అంటేనే అన్నీ యిమిడి వున్నాయి కాదండీ!

మం:- ఏమయ్యా ఆస్థానకవీ! ఈ రంధి ఏమయ్యా!

ఆ.వి.క:- ఆశుకవిత్వం చెప్పించి అందులో నిపుణుల కిప్పించండి మిగిలినవారిని నెత్తిమీద గుడ్డవేసికొని పొమ్మనండి.

మం:- ఆశుకవిత్వం చెప్పినవారికి రైలుఖర్చు లిస్తాం.

కవులు:-ఇది ఆశుకవిత్వంకాలం కాదయ్యా! ఖర్మం.

మం:-ఏమయ్యా! ఆస్థానకవీ!

ఆ.వి.క:-అయితే మీరు వ్రాసిన గ్రంథాలు బైటపెట్టమనండి - గ్రంధం తూకంబట్టి డబ్బిచ్చి పంపించండి.

మం:-మీ గ్రంథాల తూకం డబ్బిస్తా పుచ్చుకోండి. తెండి గ్రంథాలు.

కవు:-అయ్యా! నా గ్రంథం బరువు ఒక తులమే ఉంది. అందులో విషయం చాలా ఘనం. కవిత్వసారం చూడండి.

మం:-మాట్లాడరాదు. ఇది రాజాజ్ఞ.

కవులు:-భయపెట్టి సన్మానం యెగగొట్టుతారా?

రా:-ఎవరెవరు యెంతెంత అడుగుతే అంతంత యిచ్చివేయవోయ్ మంత్రివర్యా!

మం:-నక్కచావు వచ్చిందే ఖర్మం! విద్వత్కవీ! రాజుగారి మాట ప్రకారం చేద్దామా?

ఆ.వి.క:-చవటలందఱూ ఇష్టంవచ్చినట్లు అడుగుతే ఇచ్చెయ్యడానికి ఎవరబ్బసొత్తు?

మం:-అయితే చవటకవుల్ని ఏరి పారెయ్యవయ్యా!

ఆ.వి.క:-సన్నంగా, పొట్టిగా, చిన్నగా, మూతి మీసంరాని వాళ్ళందర్నీ చిన్నకవులుగా గ్రహించండి. పెద్దబొజ్జ, బృహత్తు, తలనెరవడం, కాశ్మీరు శాలువాలు వేసుకోవడం ఉన్నవాళ్ళనీ గొప్పకవులుగా ఏరండి. రికమండేషన్లతో వచ్చిన వాళ్ళనికూడా పెద్దకవులుగానే పరిగణించండి – మిగిలినవాళ్ళని చెత్త చెదారం కవులుగా కొట్టి తరమండి.

మం:-(తనలో) మంచి ఆలోచన! (పైకి) ఆర్యులారా! 180 పౌన్లు తూకంగల కవులు అంతా ముందుకిరండి (అనిపిల్చి) వారివారి కోర్కెల ప్రకారం సన్మానం పొందండి.

[నూటికి తొంభైమంది పైలక్షణాలవాళ్ళున్నారు – వారంతా ఆ రీతిగా తరించారు.]

పిల్లకవులు:-రాజా! నేను భావ కవిని, నేను సాహితీ సమితి సభ్యుడను, నేను అతివాస్తవిక కవిని; నేను జాతీయ కవిని; నేను కమ్యూనిష్టు కవిని; నేను తర్జుమా కవిని.

ఆ.వి.క:-ఓ భావకవీ! నీవు అప్పకవి దగ్గఱకిపో, నీకు శబ్దజ్ఞానంలేదు. అర్ధజ్ఞానంలేదు – నీవూ కవివే? భావకవులు సంభావనకి రావచ్చా? మీ తాత వచ్చాడా? పోపో, మంత్రీ! రెండు వకారాకారములు, తకార అకారములు యిప్పించి ఇతన్ని పొమ్మను.

భా.క:-ఇదేమి వాతకవిత్వం? పిత్తకవిత్వం విన్నాం. వ్రాసేంకాని ఇంత మోసమా? ఆస్థాన విద్వత్కవీ! మీ ఛాందసకవులు బ్రతికి ఉండగా మాకు ఎక్కడా సన్మానం జరగదన్నమాట. కానీ మాకు మంచి రోజులు రాకపోవులే!

[అని పారిపోతూన్నా చేయిపట్టుకొని భటులు ఎక్కడికో తీసికొనిపోతారు.]

ఆ.వి.క:-ఆర్యులారా! ఆ జాతికవుల సామాన్య లక్షణాలు సంగ్రహపరుస్తా వినండి - గిరజాల జుట్లు, పెద్దలాల్చీలు, బిళ్లగోచీలు, వయస్సులో వున్నకొత్త ఏ, బీ, సీ, డీలు చదివిన వితంతు వమ్మాయిల్నిచూచి వారి యౌవనం అడవికాచిన వెన్నెలౌతుందే అని "కరుణ" "లోయ," "కోన", "ప్రళయమేఘ గర్జన," "అడవి," "ఆకు," "అదేదో," "ఇదేదో," "నీవే నేనూ," "నేనే నీవూ," తెలిసీ తెలియని అసమర్థ సమాసాల్తో ఓ, యేడ్పుయేడ్చి పొట్టిలైనూ, పొడుగులైనూ వ్రాస్తూ, పేజీకి పదియక్షరాలు అచ్చువేసి మిగిలిన కాగితంలో ఖాళీ అంతా ఆ పదిఅక్షరాలభావం ఉంది అని తమంతట తాము చెప్పకయే తెలుసుకోండి అని ప్రవర్తించడం అని నేను అర్థంచేసుకొన్నాను. మీ రందఱూ ఏమంటారు?

(సశేషము)

# సిరిసిరిమువ్వలు

"ఎందుకమ్మా ! అట్ల తద్దె పండుగ నాడు అక్కయ్య, చెల్లెళ్లు తెల్లవారుజామునే లేచి అన్నము తింటారట !"

"తద్దిపండుగనాడు అలాతిని, ఉయ్యాల లూగితే ముసలిమగళ్లు రారురా !"

"అయితే నేనుకూడాలేచి అన్నంతిని ఉయ్యా లూగితే ముసలి పెళ్లాము రాదుకదమ్మా !"

♦ ♦ ♦

"మామగారూ ! తరచుగా జాబులు వ్రాస్తూం డండి. మా జాబులు అందిన వెంటనే మాత్రం జబాబు తప్పక వ్రాయండి."

"ఓ ! తప్పకుండా - కాని మీరు ఎప్పుడు వ్రాసినా రిప్లైకార్డు వ్రాస్తుండండి."

♦ ♦ ♦

"అదేమిటండీ ! - నేను పాడుతున్నంతసేపు యింట్లో ఒక నిముషమైనా కూర్చోకుండా వీధి అరుగు మీద పచార చేస్తారు ! - నా పాట నచ్చకనా..."

"అబ్బే ! అదేంలేదు - కాని నీ పాటవిని దారిన పోయేవాళ్లు, యిరుగుపొరుగు నేనింట్లో నిన్ను కొడ్తు న్నానని పరుగెత్తుకొని వస్తారేమోనని."

♦ ♦ ♦

"ఏమిటిరా - దవడవాచింది."

"పల్లునీపు."

"అయితే మంచిమందు చెప్తావిను — నా కిలాగే దవడవాస్తేను మాఆవిడను ముద్దుపెట్టుకు నేసరికి వెంబడే తగ్గిపోయింది."

"బలే మందురా ! — అయితే ఆమెను ఒకసారి పిలుద్దూ !"

ఆర్. సుబ్బరామశాస్త్రి

♦ ♦ ♦

తల్లి:—ఏమిరా చెప్పినమాట వినకుండా ఎంతవాడ వయ్యావురా !

కుమారుడు:—నేనయిందేమిటమ్మా ! — రెండడుగల వాడినిగా నన్ను చేసింది నీవేగా.

♦ ♦ ♦

ఒక బాలుడు:—ఏమండీ ! మా నాన్న గారి నెరుగుదురా?

పెద్దమనిషి:—పేరెరుగుదును కాని వారిని నేనెప్పుడూ చూడలేదు.

బా:—మా నాన్న గారికి ఒక చెవు సరిగ్గా వినబడదు లేండి!

♦ ♦ ♦

భర్త:—నేనిప్పుడు చేస్తున్న యీ చిన్న నౌకరు కాస్త ఊడిపోయేటట్లున్నది. ఇక మన అబ్బాయిని పెంచి పెద్దవాణ్ణిచేయవలసిన బాధ్యత నీదే.

భార్య:—అయ్యో ! — మీ అంత గొప్పవాణ్ణిగానైనా చేయకపోతానాండీ !

వి. శ్రీనివాసరావు




# పెద్దలో చిన్నతనం

అనగా అనగా ఒక ఊరిలో
ఉండేవాడో శాస్త్రవేత్త
మహా గట్టివాడతనని
ప్రజలందరిలో వాడుక-
అతని ఇంట్లో రాత్రులు
ఏదో సద్దుగా ఉండేది.
దీనికి కారణం పిల్లిగా
గుర్తించాడో రోజు-
గొడవచేయడానికి కారణం
దానికి వసతిగా దారిలేకుండడం-
బాగా ఆలోచించి ఆ వేత్త
గోడకి పెద్దకన్నం పెట్టాడు
దాని రాకపోకలకు వీలుగా
కొద్దికాలం నిశ్శబ్దంగా
గడిచిన తరువాత
ఒక రాత్రి ఆ శాస్త్రవేత్త
పెద్దపిల్లితోబాటు
చిన్న పిల్లిని చూశాడు-
చిన్న దానికి పెద్దగా
ఆలోచనలుచేసి
పెద్దకన్నం ప్రక్కగా
చిన్న కన్నం చేశాడు
చిన్న పిల్లికి వసతిగా.
పెద్దకన్నంలోనుంచి
చిన్నపిల్లి రాలేదనో !
చిన్న కన్నం తనకని
చిన్న పిల్లికి తెలుసనో !
పెద్ద కన్నంలోనుంచి
పోతూన్న చిన్న పిల్లినిచూసి
దాని మేధస్సుకి అబ్బుర పడ్డాడు
తన్నితా చూసుకు అతడు-
మేధావుల చిన్ని ఆలోచనల్లో
ఉండే అర్థం చాలా తక్కువేమో !
మరచాను చెప్పడం
అతడు 'న్యూటన్' అనే
ప్రపంచ ప్రఖ్యాత మేధావి.

వేటూరి భామతి

# ఐదుగురు అన్నదమ్ములు

'అర్జునుడు'

పిల్లల్లారా! మీరు ఎప్పుడైనా "ఐదుగురు మిత్రులు" కథను విన్నారు? – వినకపోతే ఈ కథ చదివి ఆనందిస్తారు కదూ!

"పూర్వం ఒక ఊరిలో నలుగురు అన్నదమ్ములు, వారి అనుచరుడు నివశించుతువుండేవారు. అనుచరుడు నిజంగా చాల బలవంతుడు. అందరికన్న పెద్దవాడు. అతడు నలుగు రన్నదమ్ములకు నాయకుడుగా వుండేవాడు. మంచి ధైర్యశాలికూడా! అతనిపేరు "పొట్టివాడు." అతడు పొట్టిగా, లావుగా వుండేవాడు. యిక అన్నదమ్ములలో మొదటివాని పేరు "తగువుల మారివాడు" అతడు ప్రతివానితోనూ తగువులకు పోతూవుండేవాడు. రెండోవానిపేరు "అందరికంటే ఘనుడు" అతడు నేను అందరికంటే ఘనుడనని డాబుసరిగా చెప్పుకొనేవాడు. అతడు పొడుగ్గా, పీలగా వుండేవాడు. మూడవ తమ్ముడిపేరు "కోశాధికారి" అతను చాల పిసినారివాడు. అతనెప్పుడూ డబ్బును భద్రపరుస్తువుండేవాడు! కట్టకడపటివాడి పేరు "చిన్నవాడు" ఎటువంటి ప్రత్యేకతలు, అట్టహాసాలూ లేక సర్వసాధారణంగా వుండేవాడు.

ఆ ఐదుగురూ ఒకనాడు అన్ని దేశాలనూ, వింతలనూ చూడాలని తలచుకుని బయలు దేరారు! అలా వింతలనుచూస్తు పోయిపోయి ఆ ఐదుగురూ బంగారు రాజ్య రాజధాని స్వర్ణపురి చేరుకొన్నారు. ఆ బంగారు రాజ్యాన్ని పరాక్రమవంతుడైన వీరసింహుడు అను ఒకరాజు పరిపాలించుతువున్నాడు. ఆరాజ్యావైభవమునుచూచి "పొట్టివానికి" కన్నుకుట్టి ఆరాజ్యాన్ని తాము ఆక్రమించాలని కోరికకలిగింది. తన అభిప్రాయాన్ని నలుగురన్నదమ్ములకు తెలిపాడు. అందుకు వాళ్లుకూడ యిష్టపడి సరే, అన్నారు! వాళ్ల ఐదుగురు సమావేశమై "తగువులమారి"ని రాజువద్దకు పంపి యుద్ధానికి పిలవాలని నిశ్చయించుకొన్నారు. తగువులమారి సరేఅన్నాడు. మరుసటి దినం ఉదయాన తగువులమారి వెళ్లి రాజును కవ్వించి, గిల్లించీ యుద్ధానికి పిలిచాడు. ఆ రాజు తన అష్టసైన్యాన్ని తీసుకొని యుద్ధరంగంలోకి దిగాడు. అష్టసైన్యం ఒకవైపు, ఐదుగురు అన్నదములు మరియొకవైపు చేరి ప్రచండంగా యుద్ధంచేసారు. యుద్ధంలో "అందరికంటే ఘనుడు" పొడుగ్గా వుండటంవల్ల సునాయాసంగా శత్రువులను సంహరించాడు. మొత్తంమీద ఎలాగైతేనేం యుద్ధంలో ఆరాజును చంపి రాజ్యాన్ని ఐదుగురు ఆక్రమించారు.

యుద్ధంలో విజయం పొందిన ఈ ఐదుగురికీ ఒక ప్రశ్న ఎదురైంది. "ఎవరో రాజై – రాజ్యాన్ని పరిపాలించాలి" అని. ఎలాగైతేం అన్నదమ్ములు నలుగురూ చేరి "పొట్టివాడు" అందుకు అర్హత కలిగినవాడని; రాజుగా ఏకగ్రీవంగా ఎన్నుకొన్నారు.

కాని పొట్టివాడు అందుకు సమ్మతించక "ఆఁ! నేనేం చేసానుగనక నేను చెప్పిందల్లా ఆలోచనే గదా! అంతా మన తగువులమారి చేసాడు. అందుకుగాను అతనిని రాజుగాచేస్తే మంచిది" అన్నాడు. తగువులమారి "అబ్బో నేనే! నేను చేసిందల్లా తగువుకు పిలుచుటేకదా. నాకంటే తమ్ముడు అందరికంటే ఘనుడు; శత్రువులను సంహరించడంలో ఎక్కువగా సహాయపడ్డాడు. అతడు అధికారాన్ని స్వీకరిస్తే శత్రువుల భయం లేకుండా, చక్కగా వుంటుంది" అన్నాడు. అందరికంటే ఘనుడు అందుకొని "ఇది బంగారు రాజ్యం. మనము ఎంత పరాక్రమం చూపి పరిపాలించినావైభవంగాపరిపాలించలేము. మన తమ్ముడు కోశాధికారైతే ఈ బంగారు రాజ్యాన్ని అతివైభవంగా ఏలగలడని

నా నమ్మకం" అన్నాడు.

కోశాధికారి — "మన మందరం అన్నదమ్ములము. మనలో చిన్నవాడు ఎటువంటి ప్రత్యేకతలు లేనివాడు అయినా శత్రువులను ఓడించడంలో మనకు సహాయపడ్డాడు. అతడే రాజ్యంచేయడం సముచితం" అన్నాడు; కాని చిన్నవాడు తను బలహీనుడనని, ఎటువంటి ప్రత్యేకతలు లేనివాడనని తను రాజ్యంచేయ నిరాకరించాడు. ఆ ఐదుగురుకలసి ఆలోచించి సమిష్టిగా రాజ్యం చేయడం మొదలెట్టారు.

బాలలూ! నేను యింతవరకు ఎవర్ని గురించి చెబుతున్నానో చెప్పగలరా! అది మన చెయ్యి, మన చేతికిగల వేళ్లే, అన్నదమ్ములు, వారి అనుచరుడు. పొట్టివాడు ఎవరో తెలుసా? అది మన బ్రొటనవేలు; అది బొద్దుగా, లావుగా వుంటుంది. తగువులమారి అంటే "చూపుడువ్రేలు". అందరికంటే ఘనుడు అంటే "మధ్య వ్రేలు" కోశాధికారి అంటే "వుంగరపువ్రేలు"; దానికే మనం బంగారపు వస్తువులు ధరిస్తాం. చిన్నవాడు అంటే "చిటికినవ్రేలు" తెలుసా — ఇవిఅన్నికలసి పరిపాలించిన బంగారు రాజ్యమే మన అరచేయి.

(మూలం: బర్మా జానపదగాథ)



(570 పేజీ తరువాయి)

ఈ కాంతాశతకములో 101 కందములు గలవు. శ్రీ డాక్టర్ కె. ఎన్. కేసరిగారు దీన్ని ప్రకటించిరి. ఇందు కాంతలకు తగిన నీతులను శ్రీ భారతీదేవిగారు తేటమాటలతో లలితమగు పదజాలముతో ధారాళమగు శయ్యతో చదువువారికి సులభముగ గ్రాహ్యమగునట్లు అలతిజాను తెనుగు పలుకుబళ్లు, నానుడులు మున్నగువానితో కూడిన సరళములగు నీతులను వెలువరించిరి. కవిత్వము ధారాళముగను, రసవంతముగను, మిగులహృద్యముగను వెలయుచున్నది.

ఈ క్రిందివి కొన్ని మెరియలవంటి నీతి వాక్యములు:—

1. నగవున కాడెడి మాటలె జగడము కల్గించుచుండు.
2. తబ్బిబ్బులుగాకు, ఫీకు ధనమున్నను.
3. దానములలోన విద్యా దానంబె శ్రేష్ఠము.
4. విశ్వమానవసేవ యొనర్చుటయే దైవసేవ.
5. గృహిణియె లేకున్న శూన్యమే ఇలు.
6. అంగనకు వలదు నాటకరంగము నెక్కంగ.

ఈ క్రిందివి కొన్ని తెలుగునాటి పలుకుబళ్లు:—

1. తలలోని నాల్క, 2. గరగరిగ, 3. ముత్తసరిగ, 4. జరజర ఈడ్చు, 5. తలయొగ్గు, 6. పసికూన, 7. అదవదలు, 8. సదమదముసేయు, 9. వసయుగ్గుపాలు 10. పొరుగమ్మలక్కలు.

ఈమె కాంతలకు మొల్లవలె కవిత్వముల్లవలెనని సలహోయిచ్చుటచే ఈమెకు ఆయమ కవితపై అనురాగమధికమని తోచుచున్నది.

ఆ పద్య మిది:—

మొల్లవలెఁ గైతఁ జెప్పిన
మల్లెలవలె స్వచ్ఛమైన మంచి యశంబుల్
కొల్లగఁ గాంతువు గను మా
సల్లలిత గవిత్వమల్లు సరణిం గాంతా!

ఈ యమ కావ్యములను (తెలుగు) జక్కగ పరిశీలించిన విదుషీరత్నము.

ధనమున్నను లేకున్నను
మనవచ్చునుగాని ధరణి మనుజుల కెందున్
మన మున్నతి లేకున్నను
మనవచ్చునె నిముసమేని మహిపై కాంతా!

ఈ పద్యము:—

ధనమిచ్చి పుచ్చుకొన్నను
మనమున నోర్వంగవచ్చు; మగఁడింతులకున్
జనవిచ్చి పుచ్చుకొన్నను
మనవచ్చునె యింక నేటిమాటలు సెపుమా.

అను ముక్కుతిమ్మనార్యుని పారిజాతాపహరణమునందలి పద్యమును స్ఫురణకు తెచ్చుచున్నది.

'పరోపకారః పుణ్యాయ పాపాయ పరపీడనం!'
అను వాక్యమునకు కాంతాశతకమున
'పరపీడయె పాపంబగు
నొరులకు నుపకారమైన నొగిఁబుణ్యమగున్'

అను అర్ధపద్యము అనువాదము. ఇట్టివి ఎన్నియైన జూపనగును. కానీ అట్టి కార్యమునకు పూనకమచ్చునకై కొన్ని పద్యము లిచ్చుటతో ఈ సమీక్ష ముగింతును.

ధర్మములలోన నుత్తమ
ధర్మము సతికి న్పతివ్రతా ధర్మమె త
ద్ధర్మము మరువక విడువక
నిర్మలమతి నాచరింపు నిరతము కాంతా!

పతిభక్తి దైవభక్తియు
నతులిత గురుభక్తిగల్గి యడకువతోడన్

శతక వాఙ్మయాను బంధము

క్షితినాత్మ గౌరవముతో
బ్రతుకందగు మానవతి ధరాస్థలి గాంతా!

శిశువులఁ బోషించుటకును
పశుపాలనఁజేసి పాడిపంటలఁ బెంపన్
యశమిల బతికి గణింపన్
వశమాగద నీకె భూమిపై విను కాంతా!

పురుషుని పాతాళమునకు
జరజర నీడ్చుటకుగాని స్వర్గోద్యానో
త్తర సీమ కెత్తగా నీ
తరుణివె కారణమటంచు దలపుముగాంతా!

స్వార్థైకపరత మొదటిది
స్వార్థ త్యాగమున రెండవది ఘటియిల్లున్
స్వార్థక జన్మ ఘటింపగ
స్వార్థ త్యాగంబె వలయునమ్మా కాంతా!

కడపటి పద్యమీ దిగువది:—

భారతము దేశరాజము
గా, రాజిల వ్రాసె, దీనిఁ గైకొనుచు, కళా
భారతులై దేశసతీ
వారములర, దేశరాజు భారతి కాంతా!




**శ్రీమహర్షి జీవిత కథామృతము (మూడవభాగము):- శ్రీ బులుసు వేంకటేశ్వర్లు, బి. ఎ., ప్రచురణ: బి. వి. అండ్ సన్స్, రామారావుపేట, కాకినాడ. వెల 1-0-0**

గ్రంథకర్త శ్రీమహర్షి జీవిత కథామృతమను పేర కొందరు మహర్షుల జీవితచరిత్రములను 1, 2 భాగములుగా రచించి ప్రచురణ జరిగింది. ఇందులో అంగిరసుడు, ఔర్వుడు, కండుడు, కణ్వుడు, కర్దముడు, గర్గుడు, గౌరముఖుడు, జాబాలి మహర్షుల జీవిత చరిత్రముల రచించి మూడవభాగముగా వెలువడినది.

ప్రాచీన భారత వర్షమహర్షుల పవిత్ర చరిత్రలు యీనాటి ప్రజాసామాన్యమునకు అన్ని విధాల మార్గదర్శకమేగాక నైతిక, ఆధ్యాత్మిక పురోభివృద్ధులకు తోడ్పడగలవు. ఇట్టి చరిత్రవ్రాసి వెలువడజేయుచున్న గ్రంథకర్త కృషి ప్రశంసనీయము.

**ఉదయఘంటలు: తెలంగాణా రచయితల సంఘమువారి సంపాదకత్వము. ప్రచురణకర్తలు: దేశోద్ధారక గ్రంథమాల, హైదరాబాదు. వెల రు 2-8-0.**

ఈ ఆధునిక ఖండకావ్య సంపుటి పురోగమిస్తున్న నవ్యాంధ్ర సాహిత్యపు పోకడలను ప్రస్ఫుటింపజేస్తున్నది.

ఇందులో మొత్తం 56గురు అఖిలాంధ్ర సుప్రసిద్ధ కవులు రచించిన 86 శీర్షికలు, దేశీయ సాంఘిక సమస్యలు, ఆర్థికసమస్యాలోపాలు, ప్రపంచక్లిష్ట పరిస్థితులు, పీడిత మానవ సంఘటనలను యితివృత్తముగా గలవి. ఈ కావ్యములలోని భావాలు, శైలి పాఠకులలో ఉత్సాహాన్ని, ఉల్లాసాన్ని రేకెత్తించడమేకాక ప్రపంచసమస్యల పరిష్కారంపట్ల ఆసక్తిని పెంపొందించగలవు. ఇందలి భావాలు కళారాధనను, తాత్కాలిక విప్లవాన్ని పురికొల్పేవి, శాశ్వతంగా ప్రపంచ సమస్యల పరిష్కారమునకు దోహదమివ్వగలవి. కాని ప్రపంచ సమస్యల పరిష్కారమునకు యిందలి కవుల భావాలు ఆధారములు కాకపోయినా ప్రజలహృదయాలు నవచైతన్యవిలసితములగుటకు, ప్రపంచ సమస్యలనుగురించి, వాని పరిష్కారావకాశములనుగురించి పాఠకులు ఆలోచించి వ్యవహరించుటకవకాశములు విస్తృతము కాగలవు.

చక్కని ముద్రణ, తయారీలతో ఆకర్షణీయంగా తయారైన యీ గ్రంథము ముద్దులు మూటగట్టుచు ఉత్సాహానందముల ప్రేరేపించుచున్నది.

— —(0)— —

# సంపాదకీయములు

## వివాహిత స్త్రీలు – ప్రభుత్వోద్యోగాలు

"భారత మహిళలు ఏయుద్యోగం చెయ్యడానికైనా సమర్థులు; కాని స్త్రీలు వివాహితులయిన తరువాత ఏర్పడే పరిణామాలను విస్మరించలేము" అంటారు పండిత నెహ్రూ.

"బ్రిటనులోవలెనే ఇండియాలోకూడ ఉద్యోగాలు చేసే తల్లుల, పిల్లల సంరక్షణ నిమిత్తం కేంద్రాలు నెలకొల్పబడాలి" అంటారు శ్రీమతి దుర్గాబాయి దేశ్‌ముఖ్ గారు.

మహిళా పురోభివృద్ధి నిరాటంకముగా మనదేశంలోను యితరదేశములలోవలె జరుగవలసినదే. కాని ప్రతియుద్యోగము తాముచేస్తామని పూనుకునేముందు వివాహితలుగాగల తమ సాధకబాధకములను స్త్రీలు గుర్తించడము మంచిది. విదేశాలలోలాగ అవసరము, అవకాశములు ఏర్పడి అన్నిరంగాలలో అవివాహితలతోపాటు వివాహితలు ఉద్యోగబాధ్యతలను నిర్వహిస్తున్నప్పుడు శ్రీమతి దుర్గాబాయి దేశ్‌ముఖ్‌గారు సూచిస్తున్న మాతాశిశు సంరక్షణ కేంద్రాలు అత్యవసరముకాగలవు.

## మద్రాసు నగరమందలి తెలుగు ప్రజా సంస్థలు

'తెలుగు మహాజనసమాజం' అనేపేరుతో తిరువల్లిక్కేణిలో తిరుపతి శ్రీ వెంకటేశ్వర విశ్వవిద్యాలయపు వైస్‌చాన్సలర్ డా. యస్. గోవిందరాజులు నాయుడుగారిచే సర్. యస్. వి. రామమూర్తిగారి అధ్యక్షతన మరొక సంస్థకు ప్రారంభోత్సవము జరిగింది.

వినోద విలాసాలకు, విజ్ఞానవ్యాప్తికి మాత్రమేకాక నగరంలోని తెలుగు ప్రజానీకానికీనాడు కాకపోయినా ముందుముందైనా కొన్ని క్లిష్టసమస్యలు ఏర్పడవచ్చును. అందులో ముఖ్యంగా బాలబాలికలకు మాతృభాషలో విద్యాబోధ ఒకటి.

భాషారాష్ట్రాల అమరకంతో సరిహద్దు ప్రాంతాల అల్పసంఖ్యాకులకిది ప్రధానసమస్య. ఈ సమస్యా పరిష్కారానికి మద్రాసువంటి నగరంలో ఏప్రాంతానికా ప్రాంతపు అల్పసంఖ్యాకు ప్రజలు సంఘాలు ఏర్పాటుచేసికొని వాని ద్వారా తమబిడ్డలకు మాతృభాషలో విద్యాబోధనకుగాను స్వంతంగా ప్రాథమిక పాఠశాలలను నెలకొల్పుకొని నిర్వహణకు రాష్ట్రీయ ప్రభుత్వముల సహకారములను పొందాలి. ముఖ్యంగా మద్రాసులో తెలుగు మహాజనసమాజం తెలుగు బాలబాలికలకు మాతృభాషా సౌకర్యాలకొరకని ప్రాథమిక పాఠశాలను ప్రారంభించి నిర్వహించుచుండటం మిగతా సంస్థలకు మార్గదర్శకమగుగాక!

శ్రీ గోవిందరాజులు నాయుడుగారు ఆశించినట్లు 'తెలుగు మహాజన సమాజం' ప్రారంభోత్సవము ఆరంభశూరత్వము కాకుండా కలకాలము వర్ధిల్లి అన్నివిధాల నగరంలోని తెలుగువారి పురోభివృద్ధికి తోడ్పడుగాక!

## సానుభూతి సంతాపములు

పండిత డి. గోపాలాచార్యులుగారి సోదరులు, ఆయుర్వేదాశ్రమం లిమిటెడ్ మేనేజింగ్ డైరెక్టర్‌గారునైన శ్రీ డాక్టరు దేశికాచార్యులుగారి అకాలమరణం చాలవిచారకరమైనది.

మద్రాసు నగరంలో దేశీయవైద్య విధానమునుసరించి మహోజ్జ్వలముగా వర్ధిల్లుచున్న ఆంధ్రసంస్థలలో ఆయుర్వేదాశ్రమం ఒకటి. పండిత గోపాలాచార్యులవారి అనంతరము తనకు వంశపారంపర్యంగానున్న ఆయుర్వేదవైద్య విధానమునందలి అనుభవము, ఆసక్తితో ఆయుర్వేదాశ్రమము దినదినాభివృద్ధిచెంది, దానధర్మములకు, మానవసేవకు నిలయమ్ము కావడానికి శ్రీదేశికాచార్యులవారొనర్చిన కృషి ప్రశంశించతగినది.

నిరాడంబరుడు, పరోపకారి, నిష్కపటియైన శ్రీదేశికాచార్యులవారి నిర్యాణం అనేకులకు సంతాపకారణమయింది. ఈసందర్భమున వారి కుటుంబానికి మాసంతాపాన్ని తెలుపుతూ వారి ఆత్మకు శాంతికలుగుట్లు భగవంతుని ప్రార్థిస్తున్నాము.

## శ్రీ జయనామ సం॥ర కార్తీక - మార్గశీర్ష మాసములు

| | | | |
|---|---|---|---|
| 1954 సం॥ నవంబరు నెల | 16 | మం | ష 5-19 పుష్య 28-40 వ 5-19 రా 31-12 |
| | 17 | బు | స 3-21 ఆర్ద్ర 27-48 రా 30-11 |
| | 18 | గు | అ 2-41 మ 29-9 రా 21-43 |
| | 19 | శు | న 3-16 పూఫ 31-40 రా 22-29 |
| | 20 | శ | ద 5-3 ఉఫ 35-17 రా 29-39 |
| | 21 | ఆ | ఏ 7-52 హ 39-51 శేష 2-5 శుక్రమౌఢ్యరహితం |
| | 22 | సో | ద్వా 11-36 చి 45-9 ది 1-30 ధనురాయ్నం |
| | 23 | మం | త్ర 15-57 స్వా 50-52 ది 0-22 |
| | 24 | బు | చ 20-41 విశా 57-0 ది 6-14 శూన్యతిథిః |
| | 25 | గు | ● అమా 25-31 ది 7-50 |
| | | | **మార్గశీర్ష మాసము** |
| | 26 | శు | శుద్ధపాడ్యమి 30-6 అనూ 2-53 వ 30-6 ది 18-13 |
| | 27 | శ | విదియ 34-23 జ్యే 8-29 రా 2-2 త్యా 4-20 చంద్రోదయం |
| | 28 | ఆ | తృ 37-53 మూ 13-30 ది 9-10 రా 11-4 |
| | 29 | సో | చ 40-24 పూషా 17-39 రా 10-38 |
| | 30 | మం | పం 41-51 ఉషా 20-50 రా 3-4 |
| 1954 సం॥ డిసెంబరు నెల | 1 | బు | ష 42-1 శ్ర 22-50 రా 4-53 స్కందషష్ఠి |
| | 2 | గు | స 40-57 ధ 23-39 రా 13-28 |
| | 3 | శు | అ 38-37 శత 23-14 రా 13-28 |
| | 4 | శ | న 35-7 పూభా 21-39 రా 16-36 |
| | 5 | ఆ | ద 30-37 ఉభా 19-4 రా 19-20 |
| | 6 | సో | ఏ 25-15 రే 15-34 ధ 25-15 త్యాజ్యాభావః |
| | 7 | మం | ద్వా 19-19 అశ్వ 11-29 ది 2-8 రా 5-42 తిథిద్వయం |
| | 8 | బు | త్ర 13-5 భ 8-0 రా 6-43 అరుణాచల క్షేత్రే దీపోత్సవః |
| | 9 | గు | చతు 6-41 కృ 2-20 రో 55-27 దత్తాత్రేయ జయంతి |
| | 10 | శు | ○ పౌ 0-34 ఏష్యం 54-7 మృ 53-47 ది 10-39 |
| | 11 | శ | విదియ 49-42 ఆర్ద్రా 50-28 ది 13-31 పరశురామజయంతి |
| | 12 | ఆ | తదియ 45-38 పున 48-4 ది 19-11 |
| | 13 | సో | చవితి 42-42 పుష్య 46-45 ది 7-31 |
| | 14 | మం | పం 40-57 ఆశ్రే 46-36 ది 18-35 త్యా 4-0 |
| | 15 | బు | ష 40-26 మఖ 47-40 ది 17-0 గొబ్బిపూజ |

Printed & Published by Dr. S. Seshagiri Rao at Lodhra Press, Kesari Kuteeram Ltd.
15, Westcott Road, Royapettah, Madras.
Founder : Dr. K. N. Kesari; Ag. Editor : C. C. Punniah.



భారత ప్రశస్తి

లోధ్ర

స్త్రీల ఆరోగ్య భాగ్యానికి



Lodhra Press, Madras-14.